Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్ రైతు

సంపుటి: 81 • సంచిక: 14 • 2-4-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# పాతబస్తీలో చిచ్చు రగిలించిందెవరు?

ఇరవైఏళ్ల విరామం తర్వాత హైదరాబాదు నగరం మరొకసారి మత కలహాలతో కల్లోలానికి గురైంది. ముప్పాతిక భాగం నగరం కర్ఫ్యూ పడగ నీడలో బిక్కుబిక్కు మంటూ కాలం గడుపుతున్నది. సాధారణంగా పాతబస్తీకి పరిమితమయ్యే మత కల్లోలాలు, ఘర్షణలు ముషీరాబాద్, గోపాలపట్నం వంటి సికింద్రాబాద్ ప్రాంతాలకు కూడా విస్తరించడం మరీ ఆశ్చర్యం కల్గించే విషయం. ఇదంతా పథకం ప్రకారం జరుగుతున్నదని పదే పదే ప్రకటిస్తున్నాడు సిటీ పోలీస్ కమిషనర్ ఎకె.ఖాన్. కానీ ఆ పథకరచన ఎవరిదో మాత్రం చెప్పడం లేదాయన. కేంద్రమంత్రి చిదంబరం కూడా ఇదే తీరులో మాట్లాడుతున్నారు. కొందరు కరడుగట్టిన రౌడీలు, కొన్ని అదృశ్యశక్తులు కలిసి అల్లర్లను ప్రేరేపిస్తున్నాయన్న అనుమానాన్ని వ్యక్తం చేశారు. మధుయాష్కి వంటి కాంగ్రెస్ ఎమ్పీలు నేరుగా, రోశయ్య ప్రభుత్వాన్ని అస్థిరపరచడానికి పనిగట్టుకొని హింసను ప్రేరేపిస్తున్నారని ఆరోపించారు. మరికొందరు కాంగ్రెస్ నేతలు ముఖ్యమంత్రి తలపెట్టిన మంత్రివర్గ విస్తరణ అడ్డుకోవడానికి ప్రజల ప్రాణాలను తీస్తున్నారని నిందిస్తున్నారు.

మొత్తం మీద అందరి అభిప్రాయం ఒకటే. ఈ మత కల్లోలాలు యాదృచ్ఛికంగా మొదలైనవి కావు, ఎవరో పని కట్టుకొని సృష్టించినవి అన్నది స్పష్టం. వారెవరు, వాటి వెనుక ఉద్దేశమేమిటి అన్నదే కనిపెట్టవలసిన అంశం.

## రియల్ ఎస్టేట్ సొమ్ముతేనే తంటా

శ్రీరామనవమి ఉత్సవాల కోసం పాతబస్తీలో ఒకచోట ఆకుపచ్చ జెండాలు తొలగించి, కాషాయ జెండాలు కట్టడానికి కొందరు స్థానికులు చేసిన ప్రయత్నంతో ఈ నేరాలకు నాందీ ప్రస్తావన జరిగింది. మహమ్మద్ ప్రవక్త జన్మదినం సందర్భంగా ఆకుపచ్చ జెండాలు ఎగరవేసి వుండినారు. నిజానికి అటు మహమ్మద్ ప్రవక్త జన్మదినం కానీ, ఇటు శ్రీరామనవమి కానీ పాతబస్తీలో ఉత్సవాల స్థాయిలో జరిగే మతపర కార్యక్రమాలు కాదు. గతంలో ఎప్పుడూ ఈ రెండు పండగలకు అంత ప్రాధాన్యత లేదు. అయితే ఇటీవల కొంతకాలంగా హైదరాబాద్ నగరంలో రియల్ ఎస్టేట్ వ్యాపారం కొంత మందిని అపర కుబేరులుగా మార్చిన విషయం తెలిసిందే. ఈ కొత్త తరం కోటీశ్వరులు తమ దర్పం ప్రదర్శించుకోవడానికి ప్రతి చిన్న సందర్భాన్ని వాడుకొంటున్నారు. చీటికిమాటికి ఉత్సవాలు, పండుగ సంబరాలు జరిపిస్తున్నారు. సహజంగానే డబ్బు విచ్చలవిడిగా వ్యయం చేసే ఉత్సవాలలో స్థానికంగా వుండే అసాంఘిక శక్తులు, వ్యక్తులు ఒకచోట చేరుతారు. తమ చేతివాటం ప్రదర్శిస్తూ వుంటారు. ఇదీ అందులో భాగంగా మొదలైన దురదృష్టకర సంఘటనని చెప్పుకోవడం అసంమంజసం కాదు.

## కిషన్‌రెడ్డి పాత్ర ఎంత?

బిజెపి రాష్ట్ర అధ్యక్షుడిగా ఎన్నికైన కిషన్‌రెడ్డికి, హైదరాబాద్ నగరంలో తమ పార్టీకి పూర్వవైభవం తేవాలనే కోరిక ప్రగాఢంగా వుంది. ఇరవై ఏళ్ల క్రితం వరకు పాత నగరంలో బిజెపి ఒక బలీయమైన రాజకీయశక్తి. పదిహేను నుంచి ఇరవై మంది వరకు మునిసిపల్ కార్పొరేటర్లు గెలిచేవారు. కానీ ఆ తర్వాత కాలంలో ఆ పార్టీ బలహీనపడింది. మజ్లిస్ శక్తి యుక్తులను ఎదుర్కొనే సత్తాకల్గిన నేతలు లేక, నీరసపడి పోయింది. ఇప్పుడా బాధ్యతను తన భుజాలకెత్తుకొన్నాడు కిషన్‌రెడ్డి. ఆయన ఆర్థికంగా మంచి స్థితిమంతుడు. కర్ణాటక గాలి జనార్దనరెడ్డితో వ్యాపార సంబంధాలున్నాయని చెప్తారు. బిజెపి అగ్రనేతలైన సుష్మాస్వరాజ్, వెంకయ్య నాయుడులతో బంధం వుంది. కాంగ్రెస్‌లో వైఎస్ కుటుంబానికి అత్యంత సన్నిహితం. మొన్నటి ఎన్నికలలో ఆయన్ను గెలిపించడం కోసమే వైఎస్.రాజశేఖర్ రెడ్డి అంబర్‌పేట నియోజకవర్గంలో మెదక్ జిల్లా నుంచి దిగుమతి చేసిన ఫరీదుద్దీన్ అనే అనామక అభ్యర్థిని నిలబెట్టి, సహకరించాడని అందరికీ తెలుసు. వైఎస్ సహకారం లేకుంటే కిషన్‌రెడ్డి శాసనసభలో ప్రవేశించి వుండేవాడు కాదన్నది నిజం. ఆర్థికంగా, రాజకీయంగా బలోపేతమైన స్థితిలో వున్నాడు కాబట్టి, బిజెపికి పూర్వవైభవం తెచ్చిన నేతగా గుర్తింపు పొందడానికి కిషన్‌రెడ్డి ప్రయత్నాలు ముమ్మరంగా నడుస్తున్నాయి. చిన్న నిప్పురవ్వగా రేగిన ఈ మత ఘర్షణలు దావానలం వలె విస్తరించడంలో కిషన్‌రెడ్డి రాజకీయ తాపత్రయం పాత్ర ఎంత అన్నదొక ప్రశ్న. పార్టీ పునరుత్తేజం కోసం ఆయన చేరదీస్తున్న స్థానిక వ్యక్తులు, చేతినిండా పని సృష్టించుకొన్నారని ఒక అనుమానం.

## అంత క్రూరులా రాజకీయవాదులు?

ఇది రాజకీయ కుట్ర అన్న ఆరోపణ ప్రతి ఒక్కరినీ అశాంతికి గురి చేస్తున్నది. ఎంత పెద్ద రాజకీయ లాభం కోసమైనా, ప్రజల ప్రాణాలతో చెలగాటమాడే హీన స్థాయికి దిగజారుతారా మన రాజకీయవాదులు? వారిలో అంతటి క్రూరులు వున్నారా? ఇది నిజం కాకూడదని అందరి కోరిక. ఒకవేళ నిజమైతే మాత్రం, పోలీసు దర్యాప్తులో కుట్ర కోణం నిర్ధారణ అయితే మాత్రం, అందుకు బాధ్యులైన తెర వెనుక శక్తులను ఉరి తీసినా పాపం వుండదు. రాళ్లతో కొట్టి చంపినా నేరం కాబోదు.




## కార్టూన్ స్కేప్




నిజమే సార్... కాసేపు ముద్దులాడుకుంటారు తర్వాత గుద్దులాడుకుంటారు! అంతా వాళ్లిష్టం!!

# రోశయ్య చతురత

శాసనసభ సమావేశాలు సాఫీగా నడిచాయి. శుభంగా ముగిశాయి. మామూలు పరిస్థితులలో శాసనసభ సమావేశాలు జరగడం, ముగియడం చెప్పుకోదగిన విషయమేకాదు. కానీ నెలరన్న రోజుల క్రితం ఈ సమావేశాలు ప్రారంభమయ్యే సమయంలో రాష్ట్రంలో నెలకొన్న రాజకీయ పరిస్థితులను పరిగణనలోకి తీసుకొంటే మాత్రం అవి అంత సాఫీగా కొనసాగడం గొప్ప విశేషం క్రిందే లెక్క. సభ తొలి సమావేశం జరిగేనాటికి తెలంగాణ ఉద్యమ వేడితో రాష్ట్రం ఉడికెక్కిపోయి వుంది. బూటకపు రాజీనామాలతో ఎమ్మెల్యేలు రాజకీయ నాటకాన్ని రక్తి కట్టిస్తుండినారు. ఆత్మహత్యల పరంపరతో ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థులు తెలంగాణ ప్రాంతం ప్రజలలో ఆవేశాన్ని రగిలిస్తుండినారు. ఆ ఉద్యమ ఉధృతికి కేంద్ర ప్రభుత్వమే గజగజ వణికి పోయే పరిస్థితి. కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కష్టం అన్న చందంగా రాజకీయ పార్టీలు వ్యవహరిస్తుండడంతో కేంద్రమంత్రి చిదంబరం రోజుకొక ప్రకటన చేసి మరింత గందరగోళం సృష్టించాడు. ఈ నేపథ్యంలో అసలు శాసనసభా సమావేశాలు జరుగుతాయా, మొదటి రోజునుంచే ఎమ్మెల్యేల రాజీనామాలతో రాజకీయ సంక్షోభం నెలకొంటుందా, రాష్ట్రపతి పాలన తప్పని పరిస్థితి ఏర్పడుతుందా, రోశయ్య ముఖ్యమంత్రిగా కొనసాగగలడా అన్న సందిగ్ధ స్థితి ఏర్పడింది. బడ్జెట్ ఆమోదం కోసం రెండు మూడు రోజులు ఎట్లైనా సభను నడిపించి, ఆ వెంటనే వాయిదా వేయగల్గితే చాలు, గండం గట్టెక్కినట్లే అని ప్రాణాలు వుగ్గబట్టుకొని రోజులు లెక్క పెట్టుకొంటుండినాడు రోశయ్య.

అయితే కేంద్రం ప్రకటించిన శ్రీకృష్ణ కమిటీ మంత్రంతో ఒక్కసారిగా రాజకీయం తీరు మారిపోయింది. అటు కాంగ్రెస్, ఇటు తెలుగుదేశం ఎమ్మెల్యేలు వంచనలో తాము జంట కవులమని నిరూపించుకొన్నారు. రాత్రికి రాత్రి గుట్టు చప్పుడు కాకుండా రాజీనామాలు వెనక్కు తీసుకొన్నారు. జానారెడ్డి వంటివారు తెలంగాణ జెఏసి పుట్టి ముంచి, ఒడ్డుకు చేరుకొన్నారు. టిఆర్ఎస్ చంద్రశేఖర్‌రావు వ్యూహం బెడిసికొట్టింది. వారి ఎమ్మెల్యేల రాజీనామాలు మాత్రం ఆమోదించిన స్పీకర్, శాసనసభలో తెలంగాణ వాణి వినపడకుండా చేయగలిగాడు.

అప్పటివరకు ముఖ్యమంత్రి రోశయ్య అంటే అందరికీ అలుసు. ఆయనకు రాజకీయం చేతకాదని, ఎందుకూ పనికి రాడని వ్యాఖ్యానించారు అందరూ. మంత్రులకైతే ఆయనంటే అలుసై పోయింది. 13 మంది తెలంగాణ మంత్రులు మూకుమ్మడిగా కలిసి వెళ్లి రాజీనామా పత్రాలు విసిరి కొట్టారు. సీమాంధ్ర మంత్రులు కూడా విందు సమావేశాలు జరిపి హూంకరించారు. క్యాబినెట్ సమావేశంలో ముఖ్యమంత్రిని లెక్క లేకుండా మాట్లాడారు. ఇవన్నీ రోజూ పత్రికలలో చదువుతున్న రాష్ట్ర ప్రజలకు ఈ ప్రభుత్వం తుమ్మితే వూడే ముక్కు వంటిదన్న నీరస భావం కల్గింది. తన మంత్రులనే కట్టడి చేయలేని రోశయ్య శాసనసభను ఎట్లా నడుపుతున్నారన్న అపనమ్మకం పెరిగింది.

కానీ రోశయ్య తనూ అపర చాణక్యుల వంశానికి చెందిన వాడినే అని నిరూపించుకొన్నాడు, ఈ నెలన్నర రోజులలో. కాంగ్రెస్ పార్టీ అన్నా, ప్రభుత్వమన్నా వంటికాలి మీద కయ్యానికి కాలుదువ్వి, కాళ్ల క్రింద గోతులు త్రవ్వడానికి సిద్ధంగా వుండే చంద్రబాబు నాయుడును మచ్చిక చేసుకోవడం ఆయన రాజకీయ చాతుర్యానికి ప్రబల నిదర్శనం. శాసనసభ సమావేశాలలో అది స్పష్టంగా కన్పించింది. ముక్కుబడిగా ప్రభుత్వాన్ని విమర్శించి, ప్రతిపక్ష పాత్రను నిలబెట్టుకోవడం తప్ప, ప్రభుత్వం ఇరకాటంలో పడే సందర్భం, సంఘటన ఏర్పడకుండా నేర్పుగా వ్యవహరించాడు చంద్రబాబు. గొర్రెను తినే వాడు పోతే బర్రెలు తినేవాడొస్తాడనే భయంతో, రోశయ్య పదవిని భద్రంగా కాపాడడానికి అన్ని జాగ్రత్తలూ తీసుకొన్నాడు. మరొకప్రక్క తనకు కేంద్ర నాయకత్వ అండ, ఆశీర్వాదం పుష్కలంగా వున్నాయన్న సందేశాన్ని ఎమ్మెల్యేలు, మంత్రులందరికీ నేర్పుగా అందజేసి, వారి బెదరింపులకు తాను భయపడే పరిస్థితి నుంచి తాను కన్నెర చేస్తే పదవులు పోతాయని వారు భయపడే పరిస్థితి సృష్టించాడు. దానితో శాసనసభలో ఎదురన్నది లేకుండా పోయింది. మొత్తం సమావేశాలు సాఫీగా నడిచిపోయాయి.

జమీన్‌రైతు

## జనవాణి

### చారిత్రాత్మక తీర్పు

సమాజంలో హిందువులైన, ముస్లింలైన చట్టపరిధిలో అందరూ సమానులే. హిందువులలో అనాదిగా వారు చేస్తుండిన వృత్తిరీత్యా వెనుకబడిన తనాన్ని గుర్తించి వెనుకబడిన తరగతుల క్రింద రిజర్వేషన్ కల్పించడం జరిగింది. ముస్లింలలో కూడా అనాదిగా వివిధ వృత్తులు చేస్తూ సమాజంలో వెనుకబడివున్నారు. వీరిని గుర్తించి స్వర్గీయ వైఎస్.రాజశేఖర్‌రెడ్డి నాలుగు శాతం రిజర్వేషన్‌ను విద్యా, వుద్యోగ అవకాశాలలో కల్పించారు. ఈ ఉత్తర్వును ఆంధ్రప్రదేశ్ హైకోర్టు కొట్టివేసింది. రాష్ట్ర ప్రభుత్వం సుప్రీంకోర్టులో రివిజన్ పిటిషన్ వేయగా ధర్మాసనాన్ని విచారించవలసిందిగా ఆదేశించింది. ఇది సర్వత్రా హర్షించదగిన విషయం.

షేక్ మొహియుద్దీన్, నెల్లూరు.
ఆర్.రాంబాబు, నెల్లూరు

### కిరణ్‌కుమార్‌రెడ్డికి మంత్రి పదవి ఇవ్వాలి!

త్వరలో జరిగే మంత్రివర్గ విస్తరణలో స్పీకర్ కిరణ్‌కుమార్‌రెడ్డికి అవకాశం ఇవ్వాలని ముఖ్యమంత్రిని కోరుచున్నాను. ప్రస్తుతం స్పీకర్‌గా పనిచేస్తున్న కిరణ్‌కుమార్‌రెడ్డి విద్యావంతుడు. గత ప్రభుత్వ హయాంలో ప్రభుత్వ చీఫ్ విప్‌గా సమర్థవంతంగా పనిచేశారు. అసెంబ్లీని ఆయన ప్రతిభావంతంగా నిర్వహిస్తున్నారు. నాలుగుసార్లు వరుసగా ఎమ్మెల్యేగా ఎన్నికైన కిరణ్‌కుమార్‌రెడ్డికి కీలకమైన మంత్రి పదవినిస్తే దాన్ని కూడా సమర్థవంతంగా నిర్వహిస్తారు.

*బి.శాలి, కావలి*

### ట్రాఫిక్ క్రమబద్ధీకరణకు కొన్ని సూచనలు!

నెల్లూరులో 1993లో అప్పటి ఎస్పీ కృష్ణప్రసాద్ ట్రాఫిక్ అడ్వయిజరీ కమిటీని ఏర్పాటు చేశారు. గత ఐదేళ్లుగా ఈ కమిటీ మీటింగ్ జరగలేదు. నగరంలో ట్రాఫిక్ క్రమబద్ధీకరించాలంటే క్రింది సూచించిన చర్యలు తీసుకొంటే బాగుంటుంది. లారీలు, బస్సులు, వ్యాన్లు, కార్లు, మోటారు సైకిళ్లు, ఆటోల హెడ్‌లైట్లకు 1/3వంతు నల్లరంగు పూయాలి. ప్రతి ఆటోడ్రైవరకు ఫోటో ఐడి కార్డు ఇవ్వాలి. ట్రాఫిక్ ఆటోమ్యాటిక్ సిగ్నల్స్ దగ్గర ఒక నిమిషం పాటు నిలుపుదల చేస్తే సరిపోతుంది. సిటీబస్సులు గాంధీబొమ్మ నుండి ట్రంకురోడ్డు మీదుగా

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

8-4-1940
పేజీలు : 24 వెల: అణా

### ఉగాది కానుక
### రంగా గారి అరెస్ట్

ఆచార్య రంగాగారు మార్చి 31తేదిన జార్జిటవున్ మద్రాసులో, వరద ముత్తియప్పన్ వీధిలో వున్నారు. ఆ రోజు సాయంత్రం సుమారు 2 గంటలకు ఇద్దరు సిఐడి వారు శ్రీముఖము తెచ్చామంటూ ఇంటర్నెంట్ ఆర్డరును రంగాగారి కిచ్చారు. దీనిలో యుద్ధ ప్రతికూల ఉపన్యాసాలొనరించుచున్నారు గాన; 24 గంటలలోగా గుంటూరు జిల్లాలోని నిడుబ్రోలు గ్రామమునకు వెళ్లి ఉపన్యాసము లివ్వకుండా వుంటూ డిస్ట్రిక్టు కలెక్టరుకు తమ వర్తమానం ఎప్పటికప్పుడు తెలియపరచవలెనని యున్నది. ఇంటర్నెంట్ ఉత్తర్వులను రంగాగారు స్వీకరించారు గాని శిరసావహించుటకు సంసిద్ధులై లేరు. ఏప్రెల్ 1 తేది సాయంత్రం 2 గంటల నుంచి వారున్న బస ఒక పెళ్లి ఇల్లులాగా యున్నది. ఒకరు వెంబడి ఒకరు వచ్చే వారికి పోయే వారికి తెంపు లేదు. రాత్రి 9గంటలకు స్థానిక పోలీసు అధికారులు, ప్రత్యేక పోలీసుశాఖవారు రంగాగారు విడిది చేసియున్న ఆఫీసుకు వచ్చారు. జయజయ ధ్వానములు మిన్నుముట్ట రంగాగారు పుష్పమాలంకృతులైనారు. శ్రీమతి భారతీదేవి రంగాగారు – "బానిసత్వంతో కుంగుతున్న భారతదేశంలో పురుషులింట్ల వద్ద సుఖపడుటుచితం కాదు" అంటూ భర్త గారిని సాగనంపారు. ఆ రాత్రి చింతాద్రిపేట పోలీస్‌స్టేషన్‌లో వుంచి, మరుదయం ఏప్రెల్ 2తేదినాడు ఎగ్మూరులో 3వ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ వి. హనుమంతరావు గారి వద్ద విచారణ జరిగింది. ఒక సంవత్సరం కఠినశిక్ష, రు 500లు జుల్మానా విధించారు.

### చిత్రగుప్తుని పంచాంగం

శ్లో॥ జిన్నా సాహెబు పిచ్చికోర్కె హరదం జెట్లండు సౌమ్యప్రదం
హిందూదేశ స్వరాజ్య కాంక్ష త్వరితం– హిట్లర్కు తృష్ణాపహం
రైతు శ్రేయముగోదయమ్ ఋణహరం– లాభప్రదం కూలినామ్
నానా కక్షలు ఐక్యదం సముచితం – పంచాంగమా కర్మతాం.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

1-4-1960
పేజీలు: 8 వెల: 0-20 న.పై

### నాకీ మంత్రిత్వం గిట్టేట్టు లేదు

జిల్లాకు ఎన్నో పనులు చేస్తామనే ఆశతోపోయాను. కాని ఏమి చేయలేక పోతాననే అభిప్రాయం కలుగుతున్నది. మంత్రివర్గ సమావేశంలో జిల్లా విషయంలో ఏదైనా వాదిస్తే, నువ్విప్పుడు నెల్లూరు జిల్లా వాడిని కాదు – రాష్ట్రానికంతా సంబంధించిన వాడివి – అడుగుటకు, ఆందోళనజేయుటకు శాసనసభ్యులున్నారు. అది నీపని కాదు అని మంత్రివర్గ మిత్రులు హెచ్చరిస్తున్నారు. మంత్రిగా కంటే, శాసనసభ్యుడు గానే కొన్ని పనులు జేసే అవకాశముండినది. న్యాయం గాని, కాకపోని చేయవలసిందేనని పట్టుబట్టి సాధించుకుండి నాను. విశ్రాంతి అనేది బొత్తిగా దొరకడం లేదు. పగలు ఆఫీసు పని జరగడం లేదు. నా గురువు స్వర్గీయ కళావెంకట్రావుగారి సూత్రాన్ని అమలు జరపడం నాకు సాధ్యంగా లేదు. వచ్చినవారితో మాట్లాడుతూ, తన పనిని తాను జేసుకోవడం ప్రతిభావంతుడైన వారి కొక్కరికే సాధ్యమయింది. రాత్రి రెండు గంటల వరకు ఫైళ్లు చూచుకోవలసివస్తున్నది. ఉదయం ఆరుకే లేవవలసి వస్తున్నది. నాకు యిచ్చటుండగా ఎనిమిది లోపల లేచే అలవాటు లేదు.

జిల్లాకు ఏమి చేయలేకుండా విశ్రాంతి లేకుండా మంత్రిత్వం ఎందుకా అనిపిస్తుంది. ఇదేమి నాకు గిట్టేట్లు లేదు. వుండవలసినంత కాలం వుంటాను, తర్వాత వచ్చేస్తాను. 30తేది సాయంకాలం తన వార్డు వారు చేసి సన్మానసభలో ప్రసంగిస్తూ అన్నారు మంత్రి ఏ.సి సుబ్బారెడ్డి. అయితే మనం వ్యంగ్యభాషణ క్రింద తీసికోవలసి వుంటుంది లెండి.

### కావలి బై ఎలక్షను

బత్తెన రామకృష్ణారెడ్డి గారి మరణంతో ఖాళీయైన కావలి నియోజకవర్గ శాసనసభ స్థాన వుపఎన్నిక అప్పుడే కార్యక్రమము నిర్ణయమై పోయింది. ఎన్నుకోబడే వ్యక్తి కాలపరిమితి 19 మాసాలే కాబట్టి, వుప ఎన్నిక కార్యక్రమం ఆలస్యం లేకుండా నిర్ణయమైపోయింది.

# నెల్లూరు ముచ్చట్లు

## అదరగొడుతున్న ఎండ!

మార్చి నెల చివరి వారానికే నెల్లూరులో ఎండలు ముదిరిపోయాయి. ఉదయం 10గంటల నుంచి సాయంత్రం నాలుగు గంటల వరకు ఇంటి నుంచి బయటకు రాలేనంతగా ఎండ తీవ్రత వుంది. ఏప్రెల్, మే నెలలో ఈ తీవ్రత ఏ స్థాయిలో వుంటుందన్న ఆందోళన జనంలో వుంది. ఎండలకు తోడు విద్యుత్ కోత జనాలను చికాకు పెడుతుంది. మార్చి నెల ఎండలకే పలువురు వడ దెబ్బకు లోనయ్యారు. భవిష్యత్తులో ఎండలు ఎలా వుంటాయన్నది భగవంతుడికి ఎరుక?



## రెండవ పంటకు నీరు!

తీవ్రమౌతున్న ఈ ఎండల్లో చల్లని కబురు జిల్లాలో రెండవ పంటకు నీరు విడుదల చేయాలని ప్రభుత్వం నిశ్చయించడమని చెప్పొచ్చు. ఏప్రెల్ 11 తేది నుంచి ఆగష్టు 31తేదీ వరకు 29 టిఎంసిల నీటిని రెండవ పంట కోసం సోమశిల ప్రాజెక్టు నుంచి విడుదల చేస్తారు. ప్రాజెక్టులో ప్రస్తుతం 44 టిఎంసిల నీళ్లున్నాయి. పెన్నా డెల్టాలో 1,91,234 ఎకరాలకు, దక్షిణకాలువ క్రింద 4వేల ఎకరాలు, కావలి కాలువ క్రింద 50వేల ఎకరాల్లో రెండవ పంటకు నీళ్లిస్తారు.

## 15న జిఎస్ఎల్వీ - డి3 ప్రయోగం?

షార్ అంతరిక్ష ప్రయోగ కేంద్రం నుంచి 2200 టన్నుల బరువు గల జిఎస్ఎస్వి–డి3 వుపగ్రహాన్ని ప్రయోగించాలని ఇస్రో సంకల్పించింది. ఈ ప్రయోగంలో ఓ విశిష్టత వుంది. ఇంతవరకు షార్ నుంచి అంతరిక్షంలో పంపిన ఉపగ్రహాలకు వాడే క్రయోజనిక్ ఇంజన్లు రష్యా నుంచి దిగుమతి చేసుకొనేవారు. ఈసారి ప్రయోగానికి స్వదేశీ పరిజ్ఞానంలో తయారుచేసిన క్రయోజనిక్ ఇంజన్లను వాడుతున్నారు. ఈ ప్రయోగం విజయవంతమైతే అంతరిక్షయానంలో భారతదేశం మరింత ముందడుగు వేయడం ఖాయమనొచ్చు.

## ఇంటిపన్ను కట్టని వివేకా!

మార్చి 31 తేదీలోగా పాత ఇంటి పన్ను బకాయిలు చెల్లిస్తే వడ్డీ మాఫీయని నెల్లూరు మునిసిపల్ కమిషనర్ ప్రకటనకు మంచి స్పందన కనిపిస్తుంది. 28, 29, 30, 31 తేదీల్లో నాలుగుకోట్ల రూపాయలకు పైగా ఇంటి పన్నులు వసూలయ్యాయి.

ఈ సమయంలో తెలుగుదేశం పార్టీ నాయకుడు కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి బాంబు పేల్చారు. మునిసిపల్ అధికారులు ప్రజల ముక్కు పిండి ఇంటి పన్నులు వసూలు చేయడం మాని పెద్ద మొత్తంలో ఇంటి పన్ను కట్టాల్సిన రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి వద్ద ముందు పన్నులు వసూలు చేయమని తెలుగుదేశం పార్టీ ఆవిర్భావదినోత్సవ సందర్భంగా నర్తకి సెంటర్‌లో జరిగిన సభలో సవాలు విసిరారు.

## నీటి సమస్య పరిష్కారానికి నిధులు

జిల్లాలో మంచినీటి సమస్య పరిష్కారానికి రాష్ట్ర ప్రభుత్వం 1.25 కోట్ల రూపాయల నిధులు విడుదల చేసింది. ఈ మొత్తంలో బోర్ల లోతు పెంచడంతోపాటు, మంచినీటి సమస్య వున్న ప్రాంతాల్లో ప్రైవేటు బోర్లను అద్దెకు తీసుకొంటారు. పైపులైన్ల విస్తరణ పనులు చేపడతారు.

## ప్రతిరోజు పగులుతున్న పైపులు

నెల్లూరు పొదలకూరురోడ్డులో కొత్త పైపులైన్ల పనులు ఏ ముహూర్తంలో ప్రారంభించారో గానీ వేసిన పైపుల్లోకి నీళ్లు వదలితేచాలు నిత్యం ఏదో ఒక ప్రాంతంలో పగిలి నీళ్లు రోడ్లపై ప్రవహిస్తున్నాయి. వీటి మరమ్మత్తు పనులు నత్తనడకన చేస్తున్నందున నీటికై జనం పడుతున్న పాట్లు వర్ణనాతీతంగా వున్నాయి. పైపులైన్ల కోసం తీసిన గోతుల్లోని ఎర్రమట్టి ఎగిరిపడుతుండడంతో జనం ఊపిరి పీల్చడం కష్టంగా వుంది. ఈ పనులు అబందరగా చేయడంతో ఎంతో బాగుండిన పొదలకూరు రోడ్డు కూడా దెబ్బతినేసింది.

## అటు పదోన్నతి - ఇటు రిటైర్‌మెంట్

ఎఎస్పీగా జిల్లాలో నాలుగేళ్లపాటు పనిచేసిన కనకారావుకు పదోన్నతి లభించింది. ఆయనకు ఐపిఎస్ హోదానిస్తూ హైదరాబాద్‌లోని ఆంధ్రప్రదేశ్ పోలీస్ అకాడమి (అప్పా) జాయింట్ డైరక్టర్‌గా బదలీ చేశారు. కాని ఈ హోదాలో కేవలం రెండురోజుల పాటు పనిచేసి మార్చి 31తేదీ పదవీ విరమణ చేయకతప్ప లేదు. గత ఏడాదిగా కనకారావు ఐపిఎస్ హోదాకు ప్రయత్నిస్తున్నా, రిటైర్‌మెంట్ సమయానికి అందుకొన్న దురదృష్ట వంతుడాయన.

కొరవ 14వ పేజీలో

# మైక్రోఫైనాన్స్ ఉచ్చులో పేదలు

పేదలకు ఆసరా కల్పించేందుకు, వారికి ఆర్థిక చేయూతనిచ్చేందుకు ప్రభుత్వం పలు పథకాలు ప్రవేశపెడుతున్నా అవి లబ్దిదారులకు చేరకపోవడంతో పేదలు మైక్రో ఫైనాన్స్‌ల ఉచ్చులో చిక్కుకుని విలవిల్లాడుతున్నారు. పావలా వడ్డీ రుణాలు పేరుకే తప్ప నిజంగా ప్రజలకు ఉపయోగపడడం లేదు. బ్యాంకర్లు సకాలంలో రుణాలు అందజేయకపోవడం, పలు కారణాల పేరుతో తిప్పుకొంటుండడంతో అధిక వడ్డీలకు రుణాలను తీసుకొని వాటిని తిరిగి చెల్లించలేక విలవిల్లాడి పోతున్నారు. దీంతో వడ్డీ వ్యాపారులు రంగ ప్రవేశంచేసి అవసరాలకు డబ్బు అప్పుగా ఇచ్చి తర్వాత పది నుంచి పదిహేను రూపాయలు వడ్డీ గుంజుతుండడంతో పేద కుటుంబాలు ఆ ఉచ్చులో చిక్కుకొని తిరిగి డబ్బు చెల్లించలేక, వారి దౌర్జన్యాలకు, ఆగడాలకు బలై పోతున్నారు. ఉండమ్మా బొట్టు పెడతా, అస్మిత, స్పందన, మైక్రోఫేమ్, షేర్‌మూలా ఇలా రకరకాల పేర్లతో పేదలను నిలువు దోపిడీ చేస్తున్నారు. పది నుంచి ఇరవై మంది వుండే గ్రూపులను తయారుచేసి ఒక్కో గ్రూపునకు లక్ష రూపాయల నుంచి రెండు లక్షల రూపాయల వరకు రుణాలిస్తారు. అధిక వడ్డీతో తీసుకొన్న మొత్తాలను రోజువారీ రూపంలో చెల్లింపులు జరపాల్సివుంటుంది. గ్రూపు సభ్యులలో



పేద ప్రజల్ని రుణగ్రస్తులను చేస్తున్న మైక్రోఫైనాన్స్ సంస్థలు.

ఒక్కరు సకాలంలో కట్టకపోయినా ఇక అప్పులిచ్చే ప్రైవేట్ వ్యక్తుల దౌర్జన్యం అంతా ఇంతా కాదు. అప్పు తీసుకున్న గ్రూపు సభ్యుల ఇళ్లకు వెళ్లి వారి వస్తువులను ఎత్తుకొని రావడం, రౌడీ మూకలతో అల్లరి చేస్తుండడంతో ఈ బాధ భరించలేక, తీసుకున్న మొత్తాలు చెల్లించలేక పలువురు ఆత్మహత్య చేసుకొన్న ఘటనలూ వున్నాయి. ఇటీ వల షేర్‌మూలా వ్యక్తులు తమ వద్ద డబ్బు తీసుకొన్న వాళ్లలో ఒకరు తిరిగి చెల్లించక పోవడంతో మిగిలిన సభ్యులను 12గంటలపాటు నిర్భందించడం తెలిసిందే. నగర శివారు ప్రాంతాలు, సన్నజనం అధికంగా వుండేచోట ఈ వ్యాపారులు తమ హవా కొనసాగిస్తుండడంతో పేదలు బలైపోతున్నారు.

# పారిశ్రామికవేత్తలు దగా చేశారు

జిల్లాలో పలు పరిశ్రమలు ఏర్పాటవుతున్నా నిరుద్యోగులకు మాత్రం ఉద్యోగ అవకాశాలు అనుకొన్నంతగా లభించడం లేదన్నది వాస్తవం. బడా పారిశ్రామికవేత్తలకు వివిధ పరిశ్రమలు ఏర్పాటు చేసుకొనేందుకు వేలాది ఎకరాల భూమి దారాదత్తం చేసినా కొన్ని మాత్రమే నిర్మాణ దశను దాటాయి. పరిశ్రమలు ఏర్పాటుకానివే అధికసంఖ్యలో వున్నాయి. నేతలు ఆర్భాటపు ప్రకటనలు, అసత్య ప్రచారాలతో ప్రజలను తప్పుదోవ పట్టిస్తూ వేలాది మందికి ఉద్యోగావకాశాలు లభిస్తాయని చెప్పినప్పటికీ వాస్తవానికి ఉద్యోగాలు లభించింది నామ మాత్రమే. పలు ప్రాంతాల ప్రజలు దీనిని అధికారుల దృష్టికి, ప్రజాప్రతినిధుల దృష్టికి తీసుకొని వచ్చినా ఎవ్వరూ స్పందించలేదు. కానీ రాజకీయాలలో తన దైనశైలిలో రాణిస్తూ విద్యార్థులకు సహాయ సహకారాలు అందించడంతోపాటు ఇసుక అక్రమ రవాణాదారుల పాలిట సింహస్వప్నంగా నిలచి జిల్లా పరిషత్‌కు కోట్ల రూపాయల రాబడి కల్పించిన వ్యక్తి ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి. ఆయన పరిశ్రమల ఏర్పాటు, ఉద్యోగావకాశాలపై కుండబ్రద్దలు కొట్టినట్లు మాట్లాడారు. తన ఛాంబర్‌లో జరిగిన జిల్లా పరిశ్రమల శాఖాధికారుల సమావేశంలో ఆయన పలు అంశాలను ప్రస్తావించారు. పరిశ్రమలు పెడతామని 1.40 లక్షల మందికి ఉద్యోగాలు కల్పిస్తామని చెప్తే 25వేల ఎకరాలు ఇచ్చారు. కానీ పారిశ్రామికవేత్తలు పదివేల మందికి కూడా ఉద్యోగాలివ్వలేదని తీవ్రంగా వ్యాఖ్యానించారు. జిల్లాలో దాదాపు 20 పరిశ్రమలు ఏర్పాటు చేస్తామన్నారు. కానీ రెండు మూడు పరిశ్రమలు కూడా ఏర్పాటు కాలేదు. పరిశ్రమల పేరుతో రైతుల వద్ద తీసుకొన్న భూమి వల్ల అన్నదాతలు దిక్కుతోచని



జడ్పీ ఛైర్మన్ ఆవేదన.

స్థితిలో పడిపోయారని ఆవేదన వ్యక్తం చేశారు. పారిశ్రామిక వేత్తల మాటలు నమ్మి వేల ఎకరాలు ఎలా వారికి అప్పజెప్పారని అధికారులను నిలదీయడంతో వాళ్లు నీళ్లు నమిలారు. దీనిపై ప్రభుత్వానికి లేఖ వ్రాసి పరిశ్రమలు పెట్టని వారి నుంచి భూములను స్వాధీనం చేసుకోవాలని సూచించారు.

# నెల్లూరులో పైరసీ క్యాసెట్ల తయారీ

సినిమాలను ఆర్థికంగా నిర్వీర్యం చేస్తున్న పైరసీ సిడిల రాకెట్‌ను నెల్లూరు పోలీసులు పట్టుకొని వేలాది సిడిలను స్వాధీనం చేసుకొన్నారు. మైపాడు గేటు సెంటర్ శ్రీరామ్‌నగర్‌లో



పైరసీ క్యాసెట్లను పట్టుకొన్న ఎస్పీ స్పెషల్ పార్టీ ఇన్‌ఛార్జ్ ఐ.శ్రీనివాసన్.

సుధాకర్, రంజిత్‌కుమార్‌లు గత కొంతకాలంగా పెద్ద ఎత్తున పైరసి సిడిల తయారీని చేపట్టారు. మద్రాస్ నుంచి అత్యాధునిక మిషన్‌లను తెచ్చి గంటకు 300 సిడిలను తయారుచేసి మార్కెటింగ్ చేస్తున్నారు. గుట్టుచప్పుడు కాకుండా జరుగుతున్న ఈ విషయంపై పోలీసులకు సమాచారం అందడంతో కొంత కాలంగా నిఘా వేసిన ఎస్పీ ఐడి పార్టీ పోలీసులు శనివారం దాడి చేయడంతో పలు పైరసీ సిడిలు వీరికి దొరికాయి. అసలు సూత్రధారి సుధాకర్ తప్పించుకోగా అతనికి సహాయకుడిగా వున్న రంజిత్‌ను పోలీసులు పట్టుకొన్నారు. కేడి, అదుర్స్, నమోవెంకటేశ, ఏమాయ చేశావె తదితర క్రొత్త చిత్రాలు పోలీసులకు దొరికాయి. ఎస్పీ దామోదర్ ఈ సందర్భంగా ఈ ముఠా గురించి వెల్లడించారు. సినీ పరిశ్రమకు చెందిన రామానాయుడు, సురేష్‌బాబు, మురళీమోహన్ తదితర పెద్ద నిర్మాతలు ఈ విషయం తెలుసుకొని ఎస్పీని, ఇతర పోలీసులను అభినందించారు. త్వరలో వీరికి ప్రశంసాపత్రాలను అందజేస్తామని ప్రకటించినట్లు ఎస్పీ వెల్లడించారు.

# మేయర్ జాడ కనుగొనండి!

నగర మేయర్ భానుశ్రీ కనిపించడం లేదంటూ తెలుగుదేశం పార్టీ పోలీసులకు ఫిర్యాదు చేయడం కలకలం రేపింది. మొన్నటి వరకు భానుశ్రీ పాల్గొనని కార్యక్రమం, ఆమె కన్పించని ఫ్లెక్స్‌లు అంటూ వుండేవి కావు. రూరల్ శాసన సభ్యుడు ఆనం వివేకానందరెడ్డి తనను వివిధ కార్యక్రమాలకు ఆహ్వానించడానికి వచ్చే వారికి భానుశ్రీని పిలవాలని గట్టిగా చెప్పేవారు. దీంతో ఆమె అన్ని చోట్ల, అన్నింటా తానై పలు కార్యక్రమాలకు హాజరవుతుండేది. కానీ అదంతా తారుమారైంది. ఎసిబి అధికారులు భానుశ్రీ ఇంటిపై సోదాలు చేసి అక్రమ ఆస్తులు కల్గి వున్నారన్న ఆరోపణలపై ప్రభుత్వ ఉద్యోగియైన ఆమె భర్త సుబ్బరాజును అరెస్టుచేసి చర్లపల్లి జైలుకు పంపారు. ఆనాటి నుంచి మేయర్ నగరం విడిచి హైదరాబాద్‌లో మకాం పెట్టడంతో నగర పాలన కుంటుపడింది. ప్రజల సమస్యలు పట్టించుకోకపోవడంతో ప్రధాన ప్రతిపక్షమైన తెలుగుదేశం పార్టీ కన్పించకుండాపోయిన మేయర్ భానుశ్రీని వెతికి పెట్టాలంటూ ఫోర్త్‌టౌన్‌లో ఫిర్యాదు ఇచ్చారు. ఎస్ఐ వేమారెడ్డి టిడిపి నాయకులతో మాట్లాడుతూ మేయర్ కన్పించకుండాపోతే మునిసిపల్ కమీషనర్‌కు కదా చెప్పాలనగా వారు స్పందిస్తూ భానుశ్రీ నివాసం వుండేది ఫోర్త్‌టౌన్ క్రిందకు వస్తుందని, ఎవరైనా కన్పించకుండాపోతే మీరే కదా ఆ కేసు దర్యాప్తు చేయాలనడంతో ఎస్ఐ ఫిర్యాదు స్వీకరించారు. అనంతరం టిడిపి నాయకులు కిలారి వెంకటస్వామినా




ఫోర్త్‌టౌన్ ఎస్ఐకు తెలుగునేతల ఫిర్యాదు.

యుడు, అంచల వాణి తదితరులు మాట్లాడుతూ ప్రజలు నీటి సమస్యతో ఒకవైపు, రోగాలతో మరోవైపు సతమతమవుతుంటే పట్టించుకోకుండా మేయర్ నగరం విడిచిపెట్టి పోయిందని విమర్శించారు.

## అవినీతి ఘనుడు

జిల్లా విద్యాశాఖలో అవినీతి అధికారులు తమ తీరు మార్చుకోవడం లేదు. అవకాశం లభించిన చోటల్లా అక్రమాలకు పాల్పడుతూనే వున్నారు. పదవ తరగతి పబ్లిక్ పరీక్షలకు సంబంధించి సూపరింటెండెంట్‌లు, ఇన్విజిలేషన్ డ్యూటీల్లో లక్షల రూపాయలు చేతులు మారడం దుమారం రేపింది. గతంలో సర్వశిక్ష అభియాన్‌లో పనిచేసి ఇప్పుడు డిప్యూటీ డిఇఓగా వున్న అధికారి ఈ కార్యకలాపాలన్నింటికి కేంద్ర బిందువు కావడంతో విద్యాశాఖ పరువు బజారునపడింది. మార్కుల కోసం పలు పాఠశాలల కరస్పాండెంట్లు అడ్డదారులు తొక్కడంతో కలెక్షన్ కింగ్‌గా పేరుబడ్డ ఈ అధికారి పాఠశాల స్థాయి, వారి ఆర్థిక పరిపుష్టిని గమనించి పదివేల రూపాయల నుంచి ఇరవై ఐదువేల రూపాయల వరకు బేరం పెట్టి దండకాలకు దిగడంతో లక్షల రూపాయలు చేతులు మారాయట. ఈ డిప్యూటీ డిఇఓకు అవినీతి పరుడిగా పేరొందిన ఆయన సహాయకుడు మధ్యవర్తిగా వ్యవహరించినట్లు విశ్వసనీయ సమాచారం.

## విద్యాసంస్థల వ్యాపారం

ప్రైవేట్, కార్పొరేట్ విద్యాసంస్థలు తమ పేరు ప్రఖ్యాతుల కోసం విద్యార్థులను పలురకాల పనులకు పురమాయించడం విమర్శలకు తావిస్తోంది. విద్యాసంస్థలు తమ విద్యార్థులకు టార్గెట్లు విధించి అధిక మొత్తం వసూలుచేసిన వారికి బహుమతులను ఎరగాచూపి నగరంలో రోడ్ల మీదకు వదులుతుంటారు. పిల్లలు వసూలుచేసిన మొత్తాన్ని విద్యాసంస్థలు తమ గొప్పగా చెప్పుకొంటుంటారు. పసివాళ్లు టీచర్లు చెప్పారని, కరస్పాండెంట్లు ఆదేశించారని తెలిసిన వారిని, తెలియని వారిని అడిగి డబ్బులు పోగు చేస్తుండడం పలు సందర్భాలలో చూస్తుంటుంటాం. ఇప్పుడు ఈ విద్యాసంస్థలు మరో అడుగు ముందుకేసి వారు నిర్వహించే టాలెంట్ టెస్టుల దరఖాస్తులమ్మే పనిని విద్యార్థులకప్పజెప్పడం వారి వ్యాపార దృక్పథాన్ని నగ్నంగా బట్టబయలు చేస్తున్నది. క్లాస్‌లో బహుమతిస్తారన్న ఆశతో పిల్లలు టాలెంట్ టెస్టు దరఖాస్తులు చేతపట్టుకొని ఇళ్లిళ్లు తిరగడం వారి తల్లితండ్రులతోపాటు, పలువురికి బాధ కల్గిస్తోంది.

# ప్రజాపథానికి సన్నాహాలు!




నెల్లూరులో జరిగిన ప్రజాపథం కార్యక్రమం (ఫైల్ ఫోటో).

**అసెంబ్లీ ఎన్నికలు జరిగి దాదాపు సంవత్సరం కావస్తున్నా ఎమ్మెల్యేలు ఆయా నియోజకవర్గాల పరిధిలోని గ్రామాలలో పెద్దగా పర్యటించలేకపోయారు. ఇటువంటి పరిస్థితులలో ప్రజాపథం కార్యక్రమం ద్వారా గ్రామీణ ప్రాంతాలలో పర్యటిస్తే నిరసనలు ఎదుర్కోవాల్సి వస్తుందని ఎమ్మెల్యేలు అభిప్రాయపడుతున్నారు.**

రాష్ట్రవ్యాప్తంగా త్వరలో ప్రజాపథం కార్యక్రమం నిర్వహించేందుకు ప్రభుత్వం సన్నాహాలు చేస్తుంది. గతంలో అప్పటి ముఖ్యమంత్రి వై.ఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రజా సమస్యలను పరిష్కారించాలన్న లక్ష్యంతో ప్రజాపథం కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు. ఆ తర్వాత ఈ కార్యక్రమం ద్వారా ప్రజల నుంచి స్వీకరించిన వినతిపత్రాలను అక్కడికక్కడే పరిష్కరించే దిశగా ఆయన కృషి చేయడం జరిగింది. గ్రామ పంచాయితీల వారీగా నిర్వహించిన ఈ కార్యక్రమానికి ప్రజల నుంచి విశేష స్పందన లభించింది. దీంతో గ్రామాలలోని సమస్యలపై అధికసంఖ్యలో ప్రజల నుంచి వినతి పత్రాలు అందాయి. మండలస్థాయిలో వుండే అన్ని ప్రభుత్వశాఖలకు చెందిన అధికారులు ప్రజాపథం కార్యక్రమంలో పాల్గొనే విధంగా ప్రభుత్వం స్పష్టమైన వుత్తర్వులు కూడా జారీ చేసింది. ప్రజల నుంచి స్వీకరించిన వినతిపత్రాలను అక్కడికక్కడే కొంతమేర పరిష్కరించాలన్నదే ప్రభుత్వ వుద్దేశం.

రాజశేఖర్‌రెడ్డి తిరిగి రెండవసారి ముఖ్యమంత్రి అయిన తర్వాత ప్రజాపథం కార్యక్రమాన్ని నిర్వహించాలని భావించిన తరుణంలో ఆయన ఆకాల మరణం చెందారు. ఈ కార్యక్రమానికి ప్రజల నుంచి అనూహ్యస్పందన లభించిన విషయాన్ని గుర్తించిన ప్రస్తుత ముఖ్యమంత్రి రోశయ్య తిరిగి ప్రజాపథం కార్యక్రమాన్ని నిర్వహించాలని నిర్ణయించారు. తొలుత అధికారుల వైపు నుంచి మాత్రం స్పందన రాకపోవడంతో ఇటీవల జరిగిన మంత్రివర్గ సమావేశంలో ప్రజాపథం కార్యక్రమ నిర్వహణపై అధికారులు అంగీకరించారు. అయితే గతంలో ఈ కార్యక్రమం ద్వారా వివిధ సమస్యలపై స్వీకరించిన వినతి పత్రాలపై చర్యలు లేకపోవడంతో అర్జీలు అందజేసిన ప్రజలు అధికారుల వైఖరిని తప్పుపడుతున్నారు. ముఖ్యమంత్రిగా కె.రోశయ్య బాధ్యతలు స్వీకరించిన తర్వాత వై.ఎస్ తరహాలో ప్రజాపథం కార్యక్రమం చేపట్టి ప్రజలు మన్ననలు పొందాలని అధికారులకు సూచించారు.

## జిల్లాలో ఏర్పాట్లు

ప్రజాపథం కార్యక్రమం ద్వారా ప్రభుత్వం అమలు చేస్తున్న సంక్షేమ, అభివృద్ధి పథకాలను వివరించడంతోపాటు ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను తెలుసుకొని పరిష్కరించాలన్న సంకల్పంతో ఈ కార్యక్రమాన్ని తిరిగి చేపట్టడం జరుగనుంది. ఇందుకు అధికారులు కూడా అంగీకారం తెలపడంతో అన్ని జిల్లాల కలెక్టర్లకు ప్రజాపథం కార్యక్రమానికి సంబంధించిన ఏర్పాట్లు చేసుకోవాలని సర్కులర్‌ను జారీ చేశారు. ప్రభుత్వం జారీ చేసిన సర్క్యులర్‌ను అందుకున్న జిల్లా అధికారులు ప్రజాపథం కార్యక్రమం ఏర్పాట్లపై తర్జన భర్జన పడుతున్నారు.

## అధికారుల్లో భయం

గతంలో జరిగిన ఈ కార్యక్రమంలో స్వీకరించిన అర్జీలలో కొన్ని పరిష్కారం కాకపోవడంతో తిరిగి గ్రామాల్లోకి వెళ్లితే ప్రజల నుంచి ఇబ్బందులు ఎదుర్కొవాల్సి వస్తుందన్నది అధికారుల భయం. ఇటీవల జిల్లావ్యాప్తంగా బోగస్ రేషన్‌కార్డుల సర్వే నిర్వహించి అర్హులైన వారి కార్డులను తొలగించడం జరిగింది. ప్రస్తుతం గ్రామాలలో నిర్వహిస్తున్న రేషన్ కార్డుల గ్రామసభలలో గందరగోళ పరిస్థితులు నెలకొంటున్నాయి. మరో పక్కా వేసవికాలం రావడంతో తాగునీటి సమస్య కూడా గ్రామీణ ప్రాంతాలలో పట్టిపీడిస్తుంది. ఇటువంటి పరిస్థితులలో ప్రజాపథం కార్యక్రమం నిర్వహించడం కష్టంగా వుంటుందని కొందరు అధికారులు సందేహం వ్యక్తం చేస్తున్నారు.

ప్రభుత్వం జారీ చేసిన సర్క్యులర్ ప్రకారం ఏప్రిల్ 19 నుంచి మే 14వ తేది వరకు ప్రజాపథం కార్యక్రమం నిర్వహించాల్సి వుంటుంది. దాదాపు 25 రోజుల పాటు నిర్వహించే ఈ కార్యక్రమంలో అన్నిశాఖల అధికారులు తప్పకుండా హాజరు కావాల్సి వుంటుంది. ఇప్పటికే ప్రభుత్వం అమలు చేసే పలు పథకాలు నిధుల కొరత కారణంగా ఆచరణకు నోచుకోలేక పోతున్నాయి. ఈ క్రమంలో ప్రజాపథం కార్యక్రమం అమలుకోసం ప్రభుత్వం నిధులు కేటాయించడం అనుమానమే. గతంలో నిర్వహించిన ప్రజాపథం కార్యక్రమం ఏర్పాట్లను గ్రామపంచాయితీ సర్పంచ్‌లు చేసేవారు.

ఈ కార్యక్రమానికి హాజరైన అధికారులు, సిబ్బందికి విఆర్వోలు, రేషన్‌షాపు డీలర్లు భోజన సదుపాయలు సమకూర్చేవారు. గ్రామాలలో నిర్వహించే ప్రతి కార్యక్రమానికి ఏర్పాట్లు చేయడం కష్టతరంగా మారిందని విఆర్వోలు, రేషన్‌షాపు డీలర్లు తలలు పట్టుకుంటున్నారు. అధికారులు చెప్పిన ఆదేశాల ప్రకారం నడుచుకోకుంటే ఎక్కడ ఆగ్రహానికి గురికావాల్సి వస్తుందన్న భయంతో ఏర్పాట్లు చేయక తప్పదని కొందరు విఆర్వోలు, పంచాయితీ కార్యదర్శులు వ్యాఖ్యానిస్తున్నారు. అసలే చాలీచాలని వేతనాలతో కాలం వెళ్లదీస్తున్న తమపై మరింత ఆర్థిక భారం మోపడం భావ్యం కాదన్నది వీరి అభిప్రాయం.

## సిఎం ఆదేశం

ఈ దఫా ప్రజాపథం కార్యక్రమాన్ని ఎక్కడా లోటుపాట్లు లేకుండా ప్రతిష్టాత్మకంగా నిర్వహించాలని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. గ్రామీణ ప్రాంతాలలో ఇందిరమ్మ గృహనిర్మాణ పథకం, జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం అమలు సక్రమంగా జరగడం లేదు. అధికారుల అవినీతికి పాల్పడుతూ నిర్లక్ష్యంగా వ్యవహరించడమే ఇందుకు కారణంగా చెప్పొచ్చు. మూడు విడతలుగా జిల్లాలో మంజూరు చేసిన పక్కాగృహాలు 40శాతం కూడా పూర్తికాకపోవడం విశేషం. ఇకపోతే జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకంలో కూలీలకు చెల్లించే నగదును ఫీల్డు అసిస్టెంట్లు స్వాహా చేసిన సంఘటనలు జిల్లావ్యాప్తంగా చోటు చేసుకున్న విషయం తెలిసిందే.

రాజకీయ ఒత్తిళ్లకు తలొగ్గిన అధికారులు నిధుల స్వాహాకు పాల్పడిన సిబ్బందిపై వుదాసీనత ప్రదర్శించారు. దీంతో లక్షలాదిరూపాయల ప్రభుత్వ నిధులు దుర్వినియోగం జరిగిపోయాయి. మండల పరిషత్, జిల్లా పరిషత్ సర్వసభ్య సమావేశాలలో బాధ్యులపై చర్యలు తీసుకోవాలని పలువురు ప్రజాప్రతినిధులు విజ్ఞప్తి చేసినా పట్టించుకునే నాధుడు లేకుండాపోయారు. ఏప్రిల్ నెలలో జరగబోయే ప్రజాపథం కార్యక్రమంలో ఆయా గ్రామాల ప్రజలు వీటిన్నింటిపై అధికారుల్ని నిలదీసే అవకాశం వుంది. త్వరలో పంచాయితీ, జిల్లాపరిషత్ ఎన్నికలు జరుగనున్న నేపధ్యంలో ప్రజాపథం కార్యక్రమం ద్వారా అధికారపార్టీ నేతలు ప్రజలకు దగ్గర కావాలన్న ఆలోచనలో వున్నారు.

## గ్రామాలకు వెళ్లని ప్రజాప్రతినిధులు

అసెంబ్లీ ఎన్నికలు జరిగి దాదాపు సంవత్సరం కావస్తున్న ఎన్నికైన ఎమ్మెల్యేలు ఆయా నియోజకవర్గాల పరిధిలోని గ్రామాలలో పెద్దగా పర్యటించలేకపోయారు. ప్రజలు అనేక సమస్యలతో సతమతమవుతున్నప్పటికీ ఎమ్మెల్యేలు వాటిని పరిష్కరించే దిశగా కృషి చేయలేకపోయారు. ప్రభుత్వం చేపట్టే వివిధ సంక్షేమ, అభివృద్ధి పథకాలు, ప్రారంభోత్సవాలు, శంకుస్థాపన కార్యక్రమాలు కూడా ఏర్పాటు జరగలేదు. దీంతో గ్రామీణ ప్రాంత ప్రజలు ఎమ్మెల్యేల వైఖరిని తప్పుపడుతున్నారు. ఇటువంటి పరిస్థితులలో ప్రజాపథం కార్యక్రమం ద్వారా గ్రామీణ ప్రాంతాలలో పర్యటిస్తే నిరసనలు ఎదుర్కోవాల్సి వస్తుందని ఎమ్మెల్యేలు అభిప్రాయపడుతున్నట్లు తెలుస్తుంది.

మొత్తంమీద ఈ నెలలో ప్రారంభం కానున్న ప్రజాపథం కార్యక్రమం అధికారులు ప్రజాప్రతినిధులకు అగ్ని పరీక్షలాంటిదని పేర్కొనవచ్చు.






నెల్లూరు కేంద్ర సహకార బ్యాంక్ సర్వసభ్య సమావేశంలో మాట్లాడుతున్న బ్యాంక్ ఛైర్మన్ వాకాటి నారాయణరెడ్డి.



తన జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని స్వగ్రామం అల్లీపురంలో అభిమానులు తెచ్చిన కేకును కట్ చేస్తున్న మాజీమంత్రి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి.

# విఫలమైన ఇ-పంచాయితీలు!

● పట్టించుకోని అధికారులు

కేంద్ర ప్రభుత్వం పంచాయితీలను పటిష్టం చేసేందుకు 2006 సంవత్సరంలో ఇ-పంచాయితీల పథకానికి శ్రీకారం చుట్టింది. నేషనల్ ఇన్ఫర్మేషన్ సెంటర్ ద్వారా జిల్లాలో 19 పంచాయితీలను ఎంపిక చేశారు. 10 లక్షల రూపాయల నిధులు కేటాయించారు. అవసరమైన కంప్యూటర్లు ఇతర పరికరాలు, ఆపరేటర్లకు శిక్షణ తదితర కార్యక్రమాలు నిర్వహించారు. దీని ద్వారా పంచాయితీల అభివృద్ధి కార్యక్రమాలు, జనన మరణాలు, ఇంటి పన్నులు, పించన్ల సమాచారం, కొళాయి కనెక్షన్లు ఇతర వ్యవహారాలు, వివరాలు కంప్యూటర్‌లో పొందుపరచి ఇంటర్‌నెట్ ద్వారా అనుసంధానం చేస్తారు. దీనిని ఉపయోగించి దేశంలో సమాచారాన్ని తెలుసుకోవచ్చునన్న ఉద్దేశ్యంతో ప్రవేశపెట్టారు. అయితే ఈ పథకం ఆరంభ శూరత్వం అయ్యింది. సక్రమైన ఫలితాలు రాకపోవడంతో కంప్యూటర్లు మూలన పడ్డాయి. ఆపరేటర్లకు జీతాలు ఇవ్వలేక, ఇంటర్నెట్ సౌకర్యానికి డబ్బు చెల్లించలేక ప్రభుత్వ ఉద్దేశ్యమే మరుగున పడిపోయింది. గ్రామ పంచాయితీలు చేతులెత్తేయడం, అధికారులు పట్టించుకోకపోవడంతో ఇ-పంచాయితీల కార్యక్రమం అభాసుపాలైంది.

● తప్పుల తడికగా...

## రేషన్‌కార్డుల సర్వే!

రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా చేపట్టిన బోగస్ రేషన్‌కార్డుల సర్వే కార్యక్రమం తప్పుల తడకగా తయారైంది. ముత్తుకూరు మండలంలో బోగస్ కార్డుల కోసం నిర్వహించిన సర్వేలో అనేక పొరపాట్లు చోటుచేసుకొంటున్నాయి. సిబ్బంది నిర్వాకం వలన నిజమైన పేదలు కార్డులు కోల్పోవాల్సిన పరిస్థితి ఏర్పడుతోంది. చిన్న పూరిళ్లు కల్గి వున్న వ్యక్తికి పక్కాగృహం వున్నట్లుగా నమోదు చేయడంతో కార్డు తొలగింపుకు రంగం సిద్ధం చేశారు. నాలుగు చక్రాల

### ముత్తుకూరులో పరిస్థితిది

తోపుడుబండి వున్న వ్యక్తికి నాలుగు చక్రాల వాహనం వుందని తెలుపుకార్డు రద్దుకు ప్రతిపాదించారు. చేపలు అమ్ముకొని జీవించే వితంతు మహిళను ప్రభుత్వ ఉద్యోగిగా చూపించి ఆమె రేషన్‌కార్డుతోపాటు పించను రద్దుకు సిఫార్సు చేశారట. దీంతో నిజమైన లబ్ధిదారులు కార్డులు కోల్పోవాల్సిన పరిస్థితి. గ్రామసభలకు సంబంధించిన ముందస్తు సమాచారం లేకుండానే వాటిని నిర్వహిస్తుండడంతో ఎవరి కార్డులు తొలగిస్తున్నారో, ఎవరి పించన్లు రద్దవుతున్నాయో అన్న విషయం లబ్దిదారులకు తెలియడం లేదు. దీనిని దృష్టిలో వుంచుకొని అధికారులు సక్రమంగా సర్వే నిర్వహించడంతోపాటు గ్రామసభల నిర్వహణపై ముందస్తు సమాచారం అందించాలని ప్రజలు కోరుకొంటున్నారు.

ఎరువుల వాడకంలో

## సమతుల్యత పాటించాలి!

పంటల్లో అధిక దిగుబడులు సాధించాలంటే ఎరువుల వాడకంలో సమతుల్యత పాటించాలని ఫర్టిలైజర్స్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా దక్షిణ మండల ప్రాంతీయ మేనేజర్ వైవిఎస్ మూర్తి సూచించారు. కృషి విజ్ఞాన్ కేంద్రంలో నేల ఆరోగ్యం, ఎరువుల వాడకంపై జరిగిన సదస్సులో ఆయన పాల్గొని పలు సూచనలు చేశారు. ఎరువుల వాడకంలో నేల స్వభావం ఆధారపడి వుంటుందన్నారు. అధిక మోతాదులో రసాయన ఎరువులు వాడడం వల్ల భూమిలోని పోషక లవణాలు అంతరించి పోతాయన్నారు. బంజరు భూములు సైతం చౌడు భూములుగా మారే ప్రమాదం వుందన్నారు. రైతులు సేంద్రీయ, జీవన, రసాయన ఎరువులను క్రమ పద్దతిలో వాడుకోవాలని సూచించారు. ఎరువుల విధానంలో బస్తాలపై ఇస్తున్న సబ్సిడీ, ఉత్పత్తికి అయ్యే ఖర్చు, రైతులకు ఇస్తున్న ధరలను త్వరలో ముద్రించనున్నట్లు వెల్లడించారు. దీని వల్ల రైతులకు ప్రభుత్వం అందజేస్తున్న సబ్సిడీ తెలుస్తుందని, డీలర్ల వల్ల మోసపోకుండా వుంటారన్నారు. వ్యవసాయశాఖ జెడి బాలయ్య మాట్లాడుతూ పంటల వారీగా ఎరువుల వాడకంలో రైతులు అవగాహన కల్గి వుండాలన్నారు. ఈ కార్యక్రమంలో అధికారులు రేమండ్, పెంచలరెడ్డి, శాస్త్రవేత్తలు కృష్ణారెడ్డి, హరిప్రసాద్, వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

## ఆదరించకపోయినా అభివృద్ధి పనులు!

వెంకటగిరిలో రాజ్యలక్ష్మమ్మ వెల్లడి



వెంకటగిరివాసులు తనను ఆదరించకపోయినా అభివృద్ధి పనులు చేస్తానని మాజీమంత్రి నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ తెలిపారు. మండలంలోని గుండ్ల సముద్రం తదితర ప్రాంతాలలో 18తేది ఆమె పర్యటించారు. తన భర్త రాజ్యసభసభ్యులు నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి కోటాలోని నిధులు 75లక్షల రూపాయలు వెచ్చించి రాపూరు, కలువాయి, సైదాపురం మండలాల్లో అభివృద్ధి పనులు చేపడుతున్నట్లు వివరించారు. కళాశాల స్థలాలను వేలం వేయరాదని దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అప్పట్లో చెప్పారని దీని ప్రకారం స్థల వేలాన్ని నిలిపివేశారని కానీ కొందరు స్వార్ధంతో కళాశాలకు సమస్యలు సృష్టిస్తున్నారని విమర్శించారు. ఈ సందర్భంగా ఆమె సమ్మర్‌స్టోరేజ్ ట్యాంకు పనులు, మునిసిపల్ కార్యాలయం, రేషన్ కార్యాలయ భవనాలు, గ్రంథాలయ భవన నిర్మాణ పనులను పరిశీలించారు. పోలీస్ బెటాలియన్‌కు క్రొత్తగా మూడు కంపెనీలు వచ్చాయని వీరందరికి క్వార్టర్స్ ఏర్పాటు చేయిస్తామన్నారు. రాపూరుకు క్రొత్త విద్యుత్ సబ్‌స్టేషన్ మంజూరైందని, అలాగే పెంచలకోనకు ఎండోమెంట్ నిధుల ద్వారా 4.50కోట్లు మంజూరయ్యాయని వివరించారు. రాజ్యలక్ష్మమ్మ వెంట పిసిసి సభ్యులు డాక్టర్ కమలాకర్‌సాయి, మునిసిపల్ ఛైర్మన్ అల్లం చంద్రమోహన్, ఎంపిపి దట్టం సుబ్బయ్య తదితరులు పాల్గొన్నారు.

## అక్రమ కిరోసిన్ పట్టివేత

తోటపల్లి గూడూరు మండలం నరుకూరు గ్రామంలో అక్రమంగా తరలిస్తున్న 400 లీటర్ల కిరోసిన్‌ను అధికారులు పట్టుకొన్నారు. రేషన్‌షాపులకు సరఫరా అయ్యే ఈ కిరోసిన్ బ్లాక్ మార్కెట్‌కు తరలిపోతుండగా గస్తీ నిర్వహిస్తున్న పోలీసులు అనుమానంతో

### గస్తీ పోలీసుల పనితీరు బేష్

విచారించడంతో ఇది బట్టబయలైంది. డీలర్లు కార్డుదారులకు అందించాల్సిన కిరోసిన్‌ను తమ ఆర్జనకోసం నల్లబజారుకు తరలిస్తుండడంతో వినియోగదారులకు అందకుండా పోతోంది. ఇలాంటివి మండలంలో పలు కేంద్రాలలో జరుగుతున్నట్లు సమాచారం. దీనిపై అధికారులు దృష్టి సారిస్తే బ్లాక్ మార్కెట్‌కు తరలిపోతున్న కిరోసిన్ జాడ తెలుస్తుంది.

## బ్లాక్ మార్కెట్‌లో వ్యవసాయ పరికరాలు

సన్నచిన్నకారు రైతులకు సబ్సిడీపై ఇచ్చే వ్యవసాయ పరికరాలు బ్లాక్ మార్కెట్‌కు తరలిపోతున్నాయి. ముఖ్యంగా ఎస్సీ, ఎస్టీ వర్గాలకు ఇచ్చిన పరికరాలు లబ్దిదారుల వద్ద వుండడం లేదు. వారి పేదరికం, బలహీనతలను ఆసరా చేసుకొని కొందరు వ్యాపారులు వాటిని కారుచౌకగా కొనుగోలు చేసి బ్లాక్‌లో అమ్ముకుంటున్నారు. బిందు, తుంపర్ల సేద్యానికి సంబంధించి స్ప్రింక్లర్లు, మోటార్లు, ఇతర పరికరాలను లబ్దిదారులకు సబ్సిడీపై ప్రభుత్వం అందిస్తోంది. రాతినేలలు, ఇసుక ప్రాంతాల్లో రైతులకు ప్రతి ఏడాది సబ్సిడీపై వీటిని అందిస్తారు. ఎస్సీ, ఎస్టీ వర్గాలకు 100శాతం రాయితీ, ఇతర వర్గాలకు 30 శాతం సబ్సిడీతో సూక్ష్మ నీటియాజమాన్య సంస్థ ఆధ్వర్యంలో ఈ పరికరాలు అందజేస్తారు. ఒక్కో యూనిట్‌కు 30వేల నుంచి 40వేల వరకు అందజేస్తారు. ఈ పరికరాలను సబ్సిడీపై అందుకొన్న పేదలు వీటిని ఇతరులకు అమ్మివేస్తుండడంతో వారు వీటిని అధిక ధరలకు అమ్మి సొమ్ము చేసుకోవడంతో ప్రభుత్వ లక్ష్యం నీరుగారిపోతోంది. ఎక్కువగా వ్యవసాయ ఎరువులు, మందులను అమ్మే వ్యాపారులు వీటిని కొనుగోలు చేసి బ్లాక్‌లో అమ్ముతున్నట్లు తెలుస్తోంది. మరికొందరు స్ప్రింక్లర్లను అద్దెకు తిప్పుతున్నారు. ఇంతగా ప్రభుత్వ ఫలాలు గాడితప్పి వ్యాపారుల చేతుల్లోకి, బ్లాక్ మార్కెట్‌లకు తరలిపోతున్నా సంబంధిత అధికారులు పట్టించుకోకపోవడం విమర్శల పాలవుతోంది.

# కావలి ఛైర్మన్‌గా చేస్తే ఎదగరా?

**పాత మునిసిపల్ ఛైర్మన్లే దీనికి సాక్ష్యం**

కావలి మునిసిపల్ ఛైర్మన్‌లకు సెంటిమెంట్ భయం వెన్నాడుతోంది. మంచి పదవి అని చేపట్టినా తర్వాత అదే తమ రాజకీయ భవిష్యత్తుకు ఆటంకం అవుతుండడంతో ఆందోళన చెందుతున్నారు. నెల్లూరు మున్సిపల్ ఛైర్మన్‌లుగా పని చేసిన వారు తర్వాత కాలంలో ఉన్నత పదవులు అనుభవించినవారు అనేక మంది వున్నారు. ఎసి సుబ్బారెడ్డి మంత్రి పదవి చేపట్టారు. తర్వాతి కాలంలో రమేష్ రెడ్డి మంత్రిత్వం పొందాడు. అంతగా నెల్లూరు నేతలకు మునిసిల్ ఛైర్మన్ గిరి కలసివస్తే కావలి ప్రాంత వాసులకు మాత్రం మునిసిపల్ ఛైర్మన్ పదవితో రాజకీయ భవిష్యత్తుకు బ్రేక్ పడుతుండడం విశేషం. 43ఏళ్ల కావలి మునిసిపాల్టీలో ఛైర్మన్‌లుగా పని చేసినవారి రాజకీయ భవిష్యత్తును పరిశీలిస్తే ఇది అవగతమవుతోంది. తొలి ఛైర్మన్‌గా తోటరామ్మూర్తి పని చేశారు. తర్వాత చక్కా సత్యనారాయణ, ఉదయభాస్కర్, ఏటూరి వరప్రసాద్, డాక్టర్ ప్రభాకర్ నాయుడు, చలంచర్ల దేవసేన, గ్రంధి యానాది శెట్టి ఈ పదవి చేట్టారు. వీరిలో పలువురు రాజకీయాల నుంచి తప్పుకోగా మరికొందరు ఎదగలేక వెనుకబడిపోయారు. గతంలో మునిసిపల్ ఛైర్మన్‌గా పని చేసిన ఉదయ భాస్కర్ ప్రస్తుతం ఒంగోలు డిఎంహెచ్‌వో కార్యాలయంలో ఎఓగా పని చేస్తున్నారు. అలాగే దేవసేన సొంత వ్యాపకాల్లో మునిగి పోగా, ప్రభాకర్ నాయుడు ఛైర్మన్ పదవి చేపట్టిన తర్వాత కౌన్సిలర్‌గా కూడా గెలవలేకపోవడం విచిత్రం. అలాగే గ్రంధి యనాదిశెట్టి రాజకీయంగా ఎదగలేకపోయారు. ఇక ప్రస్తుతం ఛైర్మన్ నగళ్ల శ్రీనివాసకిరణ్ భవిష్యత్తు తేలాల్సి వుంది. మొత్తం మీద కావలి మునిసిపల్ ఛైర్మన్‌లగా పనిచేసిన వారికి రాజకీయంగా సెంటిమెంట్ భయం వెన్నాడుతోంది.

● ఆత్మకూరులో

## పెచ్చుపెరిగిన ఆక్రమణలు

ఆత్మకూరు పట్టణంలో రోజురోజుకు అధికమవుతున్న ఆక్రమణలతో మెయిన్‌రోడ్డు కుచించుకపోయి ట్రాఫిక్ సమస్యలు ఏర్పడుతున్నాయి. ప్రధాన రహదారికి ఇరువైపులా ఆక్రమణలు రోడ్డుపైకి రావడంతో ద్విచక్ర వాహనాలు సైతం వెళ్లలేని పరిస్థితి ఏర్పడింది. రోడ్డు ధ్వంసం కావడంతో వాహనచోదకులకు అవస్థలు తప్పడం లేదు. ఈ కారణంగా ఇతర ప్రాంతాల నుంచి ఆత్మకూరుకు వచ్చే ఆర్టీసి బస్సులు పట్టణానికి మూడు కిలోమీటర్ల దూరంలో వున్న నెల్లూరుపాళెం కూడలి వద్ద నుంచే వెళ్లిపోతున్నాయి. ఇంతగా ఆక్రమణలు పెచ్చుమీరుతున్నా అటు పంచాయితీ, ఇటు రెవెన్యూ సిబ్బంది గాని పట్టించుకోకపోవడంతో పట్టణ ప్రజలు అవస్థలు పడాల్సివస్తోంది. మంత్రి రామనారాయణరెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్న ఆత్మకూరు పట్టణాన్ని త్వరలో పురపాలక సంఘంగా మారుస్తారన్న ప్రచారం జరుగుతున్న నేపథ్యంలో అధికారులు నిద్రమేల్కొని ఆక్రమణల చెర నుంచి పట్టణాన్ని విముక్తి చేయాలని ప్రజలు కోరుకొంటున్నారు.

రాష్ట్రమంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఆత్మకూరులో జరిగిన కార్యక్రమంలో పార్లమెంటు సభ్యుడు మేకపాటి రాజమోహన్‌రెడ్డిని ప్రశంసలతో ముంచెత్తడం అందరిని ఆశ్చర్యపరచింది. మహిళా సదస్సుకు ముఖ్యఅతిధిగా హాజరైన ఆనం మాట్లాడుతూ నడికుడి – శ్రీకాళహస్తి రైల్వేమార్గం మేకపాటి స్వయం కృషితోనే సాధ్యమైందన్నారు. మొత్తం 309 కిలోమీటర్లు నిడివి కలిగిన ఈ రైల్వే మార్గం ఉత్తర, దక్షిణ భారత దేశాల మధ్య 169 కిలోమీటర్ల వరకు ప్రయాణ దూరాన్ని తగ్గిస్తుందన్నారు. వరదలు తదితర ప్రకృతి వైపరీత్యాలు సంభవించినపుడు

## రైల్వే మార్గం మేకపాటి చలవే!

● ఆత్మకూరులో మంత్రి ఆనం వెల్లడి

కోస్తా తీరం వెంబడి సాగే ఈ రైలు మార్గం ప్రత్యామ్నాయంగా ఉపయోగపడుతుందన్నారు. కిలోమీటర్‌కు 6 కోట్ల రూపాయల వంతున వ్యయం అయ్యే నిర్మాణంలో సగభాగం రాష్ట్రప్రభుత్వం భరిస్తుందన్నారు. ఈ సభ సందర్భంగా మహిళానేతలు చేసిన హడావిడి ప్రజలకు అసహ్యం పుట్టించింది. ఇటీవల కాంగ్రెస్ తీర్థం పుచ్చుకొన్న పులిమి శైలజ, చిట్టమూరు మమత సదస్సు ఏర్పాట్లలో ఆధిపత్యం ప్రదర్శించడం ప్రజలను విస్తుపోయేలా చేసింది. ఈ సదస్సు ఏర్పాట్లకోసం భారీగానే దండకాలు సాగించారన్న ఆరోపణలు వినవస్తున్నాయి.

# డాక్టర్ లక్ష్మీనరసారెడ్డికి పురస్కారం!



కావలిలో బాలసుబ్రహ్మణ్యం ఆర్ట్స్ అండ్ మ్యూజిక్ అకాడమి నేతృత్వంలో డాక్టర్ లక్ష్మీనరసారెడ్డికి విశిష్ట పురస్కారాన్ని అందజేస్తున్న దృశ్యం.

● బామా ప్రతిష్ట పెరిగింది

కావలికి చెందిన పలువురు కళారంగంపై మక్కువతో బాలసుబ్రమణ్యం ఆర్ట్స్ అండ్ మ్యూజిక్ అకాడమీ (బామా)ని స్థాపించి పలు కార్యక్రమాలు నిర్వహించడంతోపాటు పలు రంగాలలో విశిష్టసేవలందించిన వారికి పురస్కారాలను అందజేస్తున్నారు. ప్రఖ్యాత జర్నలిస్టు జి.కె. రెడ్డి పేరు మీద అవార్డును నెలకొల్పి పత్రికారంగంలో లబ్ద ప్రతిష్టులైన పొత్తూరి వెంకటేశ్వరరావు, ఐ.వెంకట్రావు, సి.రాఘవాచారిలకు ప్రదానం చేశారు. 2009 సంవత్సరం నుంచి ఉగాది పురస్కారాలను అందజేసేందుకు శ్రీకారం చుట్టిన బామ విద్యారంగంలో తనదైన పాత్ర పోషించి నిరుపమాన సేవలందించిన డిఆర్‌కు ఉగాది పురస్కారం అందజేసి తనను తాను గౌరవించుకొంది. ఈ ఏడాది ఈ పురస్కారానికి వైద్యరంగంలో విశిష్టసేవలందించి ప్రజల్లో మంచి పేరు గడించిన డాక్టర్ సి. లక్ష్మీనరసారెడ్డికి అందజేసి ఘనసన్మానం చేసింది. ఈ సందర్భంగా లక్ష్మీనరసారెడ్డి దంపతులను సత్కరించారు సంస్థ సభ్యులు. వీరితోపాటు పలువురు డాక్టర్లు, రెడ్‌క్రాస్ సభ్యులు సిఎల్‌ఎన్‌ను పూలమాలలతో ముంచెత్తారు. పట్టణంలోని కారోనేషన్ రీడింగ్ రూంలో జరిగిన ఈ సత్కార కార్యక్రమంలో బామా వ్యవస్థాపక అధ్యక్ష కార్యదర్శులు డాక్టర్ బెజవాడ రవికుమార్, సుధాకర్‌రెడ్డి, సభ్యులు నరసింహం, శివప్రసాద్ తదితరులు పాల్గొన్నారు.



నెల్లూరులోని కాకతీయ జనసంక్షేమ సేవాసమితి నేతృత్వంలో జరిగిన దివంగత ఐపిఎస్ అధికారి ఉమేష్‌చంద్ర జన్మదిన వేడుకల్లో పాల్గొన్న నగర సిఐ వీరాంజనేయరెడ్డి, నాగిశెట్టి ధర్మయ్య తదితరులు.




నెల్లూరు స్వతంత్ర పార్కులో ఓపెన్ ఆడిటోరియం నిర్మించాలని కేతా అంకుల్ మెమోరియల్ ట్రస్ట్ నేతృత్వంలో జరిగిన సభలో డిమాండ్ చేసిన బివి.నరసింహం, అమరావతి కృష్ణారెడ్డి, వీరిశెట్టి హాజరత్‌బాబు తదితరులు.

# గిత్తల సంతతో సందడి

● చింతోపు - పాములవారిపాళెం మధ్య సరికొత్త సంత



తోటపల్లి గూడూరు మండలం చింతోపు – పాములవారిపాళెం గ్రామాల వద్ద ఏర్పాటు చేసిన గిత్తల సంత కళకళలాడుతోంది. ఆరోగ్యవంతమైన ఎద్దులు ఇక్కడ దొరుకుతుండడంతో పలువురు ఈ ప్రాంతానికి వచ్చి బేరసారాలు సాగిస్తుండడంతో వచ్చేపోయే వారితో సందడి నెలకొంది. కడపజిల్లా రాయచోటి ప్రాంతానికి చెందిన వై.రామాంజనేయరెడ్డి ఈ గిత్తలను కొనుగోలు చేసి ఇక్కడ సంత ఏర్పాటు చేస్తుంటారు. ఒక్కో గిత్త 40 వేల రూపాయల నుంచి లక్ష రూపాయల వరకు వుండడంతో జిల్లా నలుమూలల నుంచి రైతులు ఇక్కడకు వచ్చి నచ్చిన వాటిని కొనుగోలు చేసుకొని తీసుకొని పోతున్నారు. సంతలో మంచి మంచి గిత్తలు అందుబాటులో వుండడంతో ఎంతో ప్రయోజనకరంగా వుంటున్నదని, ఇతర ప్రాంతాలకు వెళ్లి వ్యయప్రయాసలు పడాల్సిన అవసరం లేకుండా పోయిందని రైతులు సంతోషం వ్యక్తం చేస్తున్నారు.

## మంత్రిపదవి కోసం దివాకర్ ఢిల్లీ చక్కర్లు




ఏప్రెల్ నెల మొదటివారంలో మంత్రివర్గ విస్తరణ జరిగి తమకు పదవులు వస్తాయని గంపెడాశలు పెట్టుకున్న ఎమ్మెల్యేలకు హైదరాబాదులో జరుగుతున్న అల్లర్లు తీవ్ర నిరాశను మిగిల్చాయి. అల్లర్లతో అట్టుడుకుతూ కర్ఫ్యూ నీడలో నగరం బిక్కు బిక్కు మంటుండంతో రోశయ్య మంత్రివర్గ విస్తరణను వాయిదా వేసుకోవాలనుకుంటున్నాడు. దీంతో ఆశావహులందరూ నీరుకారిపోతున్నారు. మాజీమంత్రి దివాకర్‌రెడ్డి అయితే విమానం ఎక్కి ఢిల్లీకి వెళ్లిపోయినాడు. అక్కడ అధిష్టానాన్ని ప్రసన్నం చేసుకొని అనుకున్నట్లుగానే మంత్రివర్గ విస్తరణను జరిపేలా రోశయ్యను ఆదేశించాలంటూ బతిమాలుతున్నాడట. రోమ్‌నగరం తగలబడుతుంటే ఆ దేశపు చక్రవర్తి ఫిడేలు వాయించుకుంటూ కూర్చున్నాడట. మన దివాకర్‌రెడ్డి కూడా అలాగే కనిపిస్తున్నాడంటూ ఎమ్మెల్యేలు చెవులు కొరుక్కుంటున్నారు.

## బిల్లులకు కర్ఫ్యూ దెబ్బ




మార్చి నెలాఖరులోగా చెల్లించాల్సిన ప్రభుత్వ బిల్లులకు కర్ఫ్యూ దెబ్బ తగిలింది. ఫలితంగా కోట్లాదిరూపాయల బిల్లులకు చెల్లింపులు నిలిచిపోయాయి. మార్చి 31లోగా 2009–2010 వార్షిక బడ్జెట్‌లో కేటాయించిన నిధుల్ని ఖర్చు చేసుకోవాలి. ఒక్క రోజు గడిచినా కూడా బడ్జెట్ నిధులు మురిగిపోతాయి. మార్చి నెలాఖరులో కాంట్రాక్టర్లు బిల్లులు పట్టుకొని ప్రభుత్వ కార్యాలయాలు, ట్రెజరీల చుట్టూ చక్కర్లు కొడుతుంటారు. అయితే హైదరాబాదు నగరంలో మార్చి 29వ తేదీ నుంచి కర్ఫ్యూ అమల్లో వుండడంతో బిల్లుల చెల్లింపు చాలావరకు నిలిచిపోయింది. ప్రభుత్వ ట్రెజరీ కర్ఫ్యూ ప్రాంతంలో వుండడంతో తాళాలు పడ్డాయి. దీంతో బిల్లులు రాక కాంట్రాక్టర్లు తలలు పట్టుకొంటున్నారు. తీవ్ర ఆర్థిక సంక్షోభంలో వున్న రాష్ట్ర ప్రభుత్వానికి మార్చి నెలాఖరు పరిణామాలు ఊరటనిచ్చాయని ఆర్థికశాఖ అధికారులు లోలోపల మురిసిపోతున్నారట. ప్చ్... ఎవరిగోల వారిది!!

## కాంగ్రెస్ రాజకీయాల రొచ్చు




హైదరాబాదు నగరంలోని అల్లర్లు కాంగ్రెస్ పార్టీలో చిచ్చు రేపుతున్నాయి. ఏప్రెల్ మొదటివారంలో మంత్రివర్గ విస్తరణ జరుగుతుందన్న వార్తల నేపథ్యంలో నగరంలో అల్లర్లు జరగడానికి (అ) రాజకీయ కారణాలేనంటూ కాంగ్రెస్ పార్టీ నాయకులు రచ్చకెక్కుతున్నారు. ఎమ్మెల్యే శంకర్రావు, ఎంపీ మధుయాష్కీ వంటివారు వై.ఎస్ జగన్ వైపు చూపుడు వేలు చూపిస్తున్నారు. మంత్రివర్గ విస్తరణంటూ జరిగితే వై.ఎస్ వర్గానికి కత్తెరపడడం ఖాయం కాబట్టి అసలు విస్తరణ జరగకుండా జగన్ ఆటంకాలు కల్పిస్తున్నాడంటూ వారు బహిరంగంగా చెబుతున్నారు. దీంతో ఇతర పార్టీలన్నీ కాంగ్రెస్‌పై దుమ్మెత్తి పోస్తున్నాయి. 'ఇంటి' తగాదాల కారణంగా జనాన్ని ఇబ్బంది పెట్టొద్దంటూ ప్రతిపక్షాలు ముఖ్యమంత్రిపై ఒత్తిడి తెస్తున్నాయి. కాంగ్రెస్ రొచ్చు రాజకీయాలు అధిష్టానం దృష్టికి కూడా వెళ్లాయి. చూద్దాం అధిష్టాన దేవత ఏం చేస్తుందో!!

## కునుకులేని మంత్రులు



రాష్ట్ర మంత్రివర్గ విస్తరణలో భారీ మార్పులు – చేర్పులు వుంటాయని భావిస్తున్న నేపథ్యంలో కొంతమంది మంత్రులకు కంటిపై కునుకు లేకుండా వుంది. ముఖ్యంగా వై.ఎస్ వర్గానికి వీర విధేయులుగా వుంటూ చొక్కాలు చించుకుంటున్న మంత్రులకు పదవీ బెంగ పట్టుకుంది. కన్నా లక్ష్మీనారాయణ, కోమటిరెడ్డి వెంకటరెడ్డి, రఘువీరారెడ్డి, ఆనం రామనారాయణరెడ్డి వంటి వారంతా ప్రస్తుతం రోశయ్యను 'ప్రసన్నం' చేసుకునే కార్యక్రమంలో వున్నారట. రోశయ్యతోపాటు ఆయనకు సన్నిహితులైన సీనియర్లను కూడా కాకా పడ్తున్నారట. ఏ పుట్టలో ఏ పాముందో అంటూ ఈ మంత్రులు ఎక్కే గడప దిగే గడప చేస్తున్నారంటూ కుర్ర ఎమ్మెల్యేలు తెగ జోకులేసుకుంటున్నారు.

## ప్రకటనల 'సాక్షి'గా ప్రజాధనం దుబారా!




వై.ఎస్ తనయుడు జగన్ సారధ్యంలోని 'సాక్షి' దినపత్రికకు నిబంధనల్ని ఉల్లంఘించి ప్రభుత్వం కోట్లాది రూపాయల ప్రజాధనాన్ని దోచిపెట్టింది. నెలలు కూడా నిండని సాక్షి పత్రికకు అడ్డూ అదుపు లేకుండా కోట్లాదిరూపాయల్ని 'ప్రకటనల' పేరుతో కట్టబెట్టడాన్ని 'కాగ్' తప్పు బట్టింది. ప్రభుత్వ నిధుల ఖర్చుపై నిఘా పెట్టి ప్రతీ సంవత్సరం కాగ్ నివేదిక సమర్పిస్తుంది. ఈ ఏడాది నివేదికలో సాక్షి పత్రిక పట్ల ప్రభుత్వం పక్షపాతంతో వ్యవహరించిందని కాగ్ సాక్ష్యాధారాలతో వెల్లడించింది. సాధారణంగా సర్క్యులేషన్ ఆధారంగా ఆయా పత్రికలకు ప్రభుత్వ ప్రకటనల్నీ జారీ చేస్తారు. 'సాక్షి' కొత్త పత్రిక అయినప్పటికీ ఇతర పత్రికలకు మించి ప్రకటనలు జారీ చేసారని కాగ్ తేల్చింది. దీనివల్ల 'సాక్షి' సర్క్యులేషన్ పెంచుకుందట అన్నట్లు వై.ఎస్ సిఎంగా వున్నప్పుడే ఇది జరగడం కొసమెరుపు.

## టీ కప్పులో తుఫాను




మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డిపై ఆయన సోదరుడు పద్మనాభరెడ్డి ముఖ్యమంత్రికి ఫిర్యాదుచేసిన సంఘటన అసెంబ్లీ లాబీల్లో చర్చనీయాంశమైంది. విద్యానగర్ విద్యా సంస్థల వివాదాన్ని రాజకీయాలతో ముడిపెట్టి పద్మనాభరెడ్డి అసెంబ్లీ లాబీల్లో హల్ చల్ సృష్టించాడు. మంగళవారం నాడు పద్మనాభరెడ్డి అసెంబ్లీకి వచ్చాడు. రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఆయనను సాదరంగా ఆహ్వానించి రోశయ్య దగ్గరకు తీసుకెళ్లాడు. పద్మనాభరెడ్డి తమ్ముడిపై రెండు పేజీల ఫిర్యాదుపత్రాన్ని రోశయ్యకు అందజేశాడు. ఆ తర్వాత బయటకు వచ్చి పనబాక కృష్ణయ్యను వెంటబెట్టుకొని మీడియా పాయింట్‌కు వెళ్లి మాట్లాడాడు. గూడూరులో పనబాకకు వ్యతిరేకంగా పనిచేయనందుకే జనార్ధరెడ్డి తనపై పగ బట్టి సాధిస్తున్నాడన్నది పద్మనాభరెడ్డి ఆరోపణ, అయితే ఈ విషయం ఎన్నికలైన ఏడాది తర్వాత తెరపైకి తేవడమేమిటని అక్కడున్న విలేకరులు ప్రశ్నించగా... ఆయన సమాధానాన్ని దాట వేశాడు.

# క్రైస్తవ సోదరులకు పవిత్రదినం గుడ్‌ఫ్రైడే!



క్రైస్తవులకు పవిత్ర దినం గుడ్ ఫ్రైడే. ఏసుక్రీస్తుకు శిలువ వేసిన రోజును, కల్వరి వద్ద ఆయన మరణం యొక్క జ్ఞాపకాలను గుర్తుచేసుకొనే రోజు ఇదే. దీనిని గాడ్స్‌ఫ్రైడే అని, హోలీఫ్రైడే అని, బ్లాక్ ఫ్రైడే అని, గ్రేట్ ఫ్రైడే అనికూడా అంటారు. తనకు శిలువ వేసిన వారినీ క్షమించిన కరుణామయుడు ఏసుక్రీస్తు. పాపాల నుంచి తమను కాపాడేందుకు వచ్చిన దైవ కుమారుడు చివరిశ్వాస విడచిన రోజును ప్రపంచవ్యాప్తంగా వున్న క్రైస్తవులు సంతాపదినంగా పరిగణించి ఆ దైవ కుమారునికి నివాళులు అర్పిస్తారు.

క్రీస్తు తన శిలువను శిక్షను అమలు చేసే స్థలానికి మోసుకొని వస్తాడు. అక్కడ ఆయనకు శిలువ వేయడంతో ఆరు గంటల పాటు విపరీతమైన బాధను అనుభవించాడు. శిలువపై ఆయన యొక్క చివరి 3 గంటలలో అనగా మధ్యాహ్నం 12 గంటల నుంచి 3 గంటల వరకు ఆ ప్రాంతం మొత్తం చీకటి అయిపోయింది. క్రీస్తు ఒక పెద్ద ఆర్తనాదంతో తన శ్వాసను విడచి పెట్టాడని అప్పుడు భూకంపం సంభవించినట్లు పవిత్ర గ్రంథాలు చెప్తున్నాయి. పలు దేశాలలో గుడ్‌ఫ్రైడేను అధికారిక సెలవుదినంగా పాటిస్తారు. క్రీస్తు చివరిగా శిలువపై మరణయాతన అనుభవించిన 3 గంటలూ ప్రత్యేక ప్రార్థనలు నిర్వహిస్తారు.

గుడ్‌ఫ్రైడే రోజు క్రైస్తవులు చర్చికి వెళ్లి ప్రార్థనలు చేస్తారు. క్రీస్తు ఆఖరు విందు ది లాస్ట్ సప్పర్‌కు గుర్తుగా ముందు రోజు రాత్రైన గురువారం నాడు విందు ఆరగిస్తారు. మరునాడు ఉపవాస దీక్ష పాటించి క్రీస్తు సిద్ధాంతాలను చదువుతారు. ఇది 12 ప్రేమపూరిత దైవ ప్రవచనాలతో ప్రార్థనలు జరుగుతాయి. ఆ ప్రవచనాలు క్రీస్తు యొక్క చివరి భోజనం నుంచి శిలువ వేయడం, ఏసు శరీరాన్ని పూడ్చిపెట్టడం వంటి ప్రేమపూరిత ఘట్టాలను జ్ఞప్తికి తెస్తాయి. ఆరోజున ఏ చర్చిలోనూ గంటలు మోగించరు. శనివారం నాడు సంతాప దినంగా పాటించి ఏసుక్రీస్తు పునరజ్జీవుతుడైనట్లు చెప్పే ఈస్టర్ సండే నాడు తిరిగి గంటలు మ్రోగించడం ఆనవాయితి.

## ట్రంకు రోడ్డు

### వేగుల్లా మారిన పోలీసులు



నెల్లూరు పోలీసులు గత మాసం రోజులుగా తమ వ్యవహారశైలికి భిన్నంగా ప్రవర్తిస్తున్నారు. రాజుల కాలం నాటి వేగుల్లా నగరంలోని వివిధ ప్రాంతాలకు వెళ్లి అక్కడి ప్రజల క్షేమసమాచారాలు అడుగుతున్నారు. ఆయా ప్రాంతాల్లో రౌడీలు, జులాయిలు, దొంగలు వివిధ కేసుల్లో శిక్షలు పడ్డవారి వివరాలు సేకరిస్తున్నారు. 29తేదీ నగర సిఐ వీరాంజనేయరెడ్డి, పట్టణ ఎస్ఐలు ఇదే తరహాలో సిటీ బస్సుల్లో ఎక్కారు. ప్రయాణీకులకు సాధకబాధకాలు అడిగి తెలుసుకొన్నారు. బస్సుల్లో కండక్టర్లు, క్లీనర్లు, డ్రైవర్లు ఎలా వ్యవహరిస్తున్నారని పోబిడీ తీశారు. బస్సుల్లో పనిచేసే సిబ్బంది వల్ల ఏమైనా ఇబ్బందులుంటే తమకు తెలియజేయమని సిఐ తన సెల్‌ఫోన్ నెంబరు కూడా ఇచ్చారు. ప్రజలతో పోలీసులు మమేకం కావాలన్న ఎస్పీ ఈతముక్కల దామోదర్ గారికి వచ్చిన ఆలోచన మూలంగానే నెల్లూరు పోలీసులు ఈ కొత్త అవతారం ఎత్తారనవచ్చు.

### మారని చరిత్ర



తరాలు మారినా, చట్టసభల్లో పోటీకి రిజర్వేషన్ల వంటి సౌకర్యాలు ఒనకూడుతున్న అతివలు మాత్రం పురుష అహంకార పద ఘట్టనలలో నలిగిపోతున్నారు. ఈవారంలో మహిళా చైతన్యస్ఫూర్తికి ఝురియైన నెల్లూరు నగరంలో కట్నం తాలుకు బకాయి తేలేదని ఓ మృగాడు తన భార్యను ఇంట్లో వుంచి సజీవ దహనం చేశాడు. డ్రైవర్స్ కాలనీలకి చెందిన రియాఖత్ అలీఖాన్‌కు పర్వీన్‌తో ఐదేళ్ల క్రితం వివాహమయ్యింది. లియాఖత్ దేవదాసు. పర్వీన్ కూలీకి వెళ్లి అతన్ని పోషించేది. అయినా ఈ ప్రబుద్ధుడు అదనపు కట్నం కోసం వేధించేవాడు. ఆమె తండ్రి ఇంటి ప్లాట్ అమ్మి డబ్బులు తెమ్మనేవాడు. వున్నా ఒకే ఒక ఆర్థిక ఆధారాన్ని పోగొట్టుకుంటే ఎలానని పర్వీన్ వారించినా వినని ఈ దుర్మార్గుడు ఆమెను 28తేది వేకువజామున ఆమె ఇంటిలో వుండగా కిరోసిన్ పోసి సజీవ దహనం చేశాడు.

### లీడర్ జన్మదినం

ఎవరు ఔనన్నా... ఎవరు కాదన్నా జిల్లా రాజకీయాల్లో సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఓ ముఖ్యమైన నాయకుడు. అందుకే ఆయన జన్మదినోత్సవాన్ని అభిమానులు ఈవారంలో పండుగ దినంలా జరిపారు. నెల్లూరు నగరమంతా 'లీడర్'కు జన్మదినోత్సవ శుభాకాంక్షలంటూ ఫ్లెక్స్‌బోర్డులు కట్టారు. అధికారం ఆయన చేతిలో లేకపోయినా పలువురు ఆయన ఇంటికి తరలివెళ్లి పూలమాలలతో ముంచెత్తారు. అధికారులు మాత్రం రహస్యంగా సెల్‌ఫోల్‌లో అభినందనలు తెలియజేస్తూ ఎస్.ఎం.ఎస్‌లు పంపారు. చంద్రమోహన్‌రెడ్డి జిగర్‌దోస్త్ చిన్నపిల్లల డాక్టర్ జడ్.శివప్రసాద్ ప్రత్యేకంగా చేయించిన 60కిలోల కేక్‌ను అల్లీపురం తీసుకెళ్లి ఆయన చేత కట్ చేయించారు. వాస్తవానికి చంద్రమోహన్‌రెడ్డికి 54ఏళ్లు. కాని 60ఏళ్లు స్ఫురించేలా ఈ కేక్ కట్ చేయించడమేమిటని కొందరు ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు. కాని అభిమానుల ఆనందాన్ని సోమిరెడ్డి కాదనలేకపోయారు.




### పాపం... బీదా!



కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు అసెంబ్లీలో చర్చ సమయంలో ఎరక్కబోయి ఇరుక్కున్నాడు. ఆయన మాట్లాడుతూ రొయ్యల సాగువలన వాతావరణ కాలుష్యం ఏర్పడుతుందన్నారు. దీంతో ఒక్కసారిగా కాంగ్రెస్ శాసన సభ్యులు బీదపై విరుచకపడ్డారు. నెల్లూరుజిల్లా అల్లూరు సముద్రతీర ప్రాంతమంతా రొయ్యలసాగు చేపట్టింది ఆయననేనని అది మరచి వాతావరణ కాలుష్యం గూర్చి మాట్లాడడమేమిటనే సరికి పాపం బీద వుక్కిరి బిక్కిరి అయ్యారు. తప్పు మాట్లాడినా దాన్ని సమర్థించుకొనే రాజకీయ నాయకుల తెలివితేటలు బీద మస్తాన్‌రావుకు ఇంకా అబ్బ లేదనేందుకు ఈ సంఘటనే సాక్ష్యమనొచ్చు.

### పోలంరెడ్డి వైరాగ్యం!



కోవూరు మాజీ శాసనసభ్యుడు పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఈ మధ్య ఆటుపోట్లు ఎదుర్కొంటున్నారు. సొంత పార్టీలో అసమ్మతి సెగ తదితర సమస్యలతో ఆయననలో వైరాగ్యం పుట్టింది. దీంతో ఆయన వేదాంతధోరణిలో మాట్లాడుతున్నారు. శ్రీరామనవమి వుత్సవాలకుగాను కోవూరుకు వచ్చిన శీనయ్య మాట్లాడుతూ ప్రపంచానికి ఆదర్శపురుషుడైన శ్రీరామచంద్రునికే కష్టాలు తప్పలేదని మానవమాత్రులైన మనమెంతన్నారు. కష్టాలు ఎదురైనప్పుడు శ్రీరాముని ఆదర్శంగా తీసుకొని ఆత్మ స్థైర్యంతో ముందుకు నడవాలని కార్యకర్తలకు వుద్బోధించడంతో వారు ఆలోచనలో పడ్డారు.

# వారఫలాలు

*తేది 3-04-2010 నుండి 9-04-2010 వరకు మీనంలో రవి; మేషంలో బుధ, శుక్రులు; కుంభంలో గురువు; కర్కాటకంలో కుజుడు; కన్యలో శని; ధనస్సులో రాహువు; మిధునంలో కేతువు; వృశ్చిక, ధనుర్మకరాల్లో చంద్రుడు సంచరిస్తారు.*




మానసికంగా బాధపడతారు. బంధుమిత్రుల్లో ఒకరి ఆరోగ్యం ఆందోళనకరం. పరిసరాల్లో జరిగే సంఘటనలు బాధాకరంగా ఉంటాయి. కొత్త పరిసరాలలో సర్దుబాటు అవడం కష్టం. వృత్తి రీత్యా కొంత జాగ్రత్త అవసరం. వ్యాపారులకు కష్టనష్టాలుంటాయి. వాహనాలు నడిపే సమయంలో అతి జాగ్రత్త అవసరం. మతి స్థిమితం లేనివారి వల్ల ఇబ్బందులు ఎదురు అవవచ్చు.




సోదరుల మూలంగా మేలు జరిగే అవకాశాలు. బంధు మిత్రులు మనస్ఫూర్తిగా సహాయ సహకారాలు అందిస్తారు. అన్ని పనులు తలచిన రీతిలో జరుపుకొంటూ పోతారు. ఊహించని మార్గాలగుండా ధనాదాయప్రాప్తి సూచితం. స్వీయ వృత్తిలోనివారికి మంచి ఆదాయం, ఉత్సాహం ఉంటుంది. ఉద్యోగులకు ప్రోత్సాహకాలు లభిస్తాయి. రాజకీయుల పథకాలు చక్కగా ఫలిస్తాయి.




అపనిందలు వచ్చే అవకాశాలున్నాయి. తెలివిగా నడచుకోవాలి. మానసిక అశాంతి వల్ల పనులలో జాప్యం. సుఖసంతోషాల లోపం. మాటలు పొదుపుగా, జాగ్రత్తగా మాట్లాడాలి. సంతానం కారణంగా అశాంతి ఉండవచ్చు. రాజకీయులు పైవారి ఆదరానికి దూరమవుతారు. తొందరపాటు వద్దు. ఉద్యోగులు పై అధికారుల మన్ననలకు పాత్రులౌతారు. ఇష్టులైన వారినుండి ప్రియవార్తలు వింటారు.




పెద్దల ఆరోగ్యం ఆందోళనకరం. కుటుంబసభ్యులతో భిన్నాభిప్రాయాలు మానసిక అశాంతి ఉంటుంది. నమ్మిన వారికి, ఆశ్రయించిన వారికి మేలు చేస్తారు. పనులు ఆటంకాలతో ముగుస్తాయి. ఆర్థికవిషయాలు చక్కగా ఉన్నాయి. ఉద్యోగులు అధికారులతో జాగ్రత్తగా ఉండాలి. ఖర్చులు అధికమవుతాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. రాజకీయులకు పోటీలెక్కువ.




భాగస్వామ్యాలు చక్కని లాభాలనందిస్తాయి. కుటుంబసభ్యుల యొక్క అవసరాలు తీరుస్తారు. మిత్రులు చేదోడు వాదోడుగా ఉంటారు. ఆరోగ్యవిషయంలో కొంత ఆసక్తి చూపాలి. ఆర్థిక లావాదేవీలు ప్రయోజనరహితం కావచ్చు. ఖర్చులు అధికమనిపించినా ఆదాయం బాగుంటుంది. సంప్రదింపులు, సమాలోచనలు సత్ఫలితాలనివ్వవచ్చు. విద్యార్థులు కోరిన ఫలితాల్ని పొందగలరు.




ధనాదాయం ఓ మోస్తరుగా ఉంటుంది. ఆగిపోయిన పనుల్ని శ్రమమీద పూర్తి చేస్తారు. వ్యాపారులకు అత్యంత ప్రోత్సాహకరంగా ఉంటుంది. వాణిజ్యం చక్కగా ఊపందుకొంటుంది. రాజకీయులు ప్రతిబంధకాలు తొలగి నూతనోత్సాహంతో వ్యాపకాల్లోకి దిగుతారు. చర్చలు సత్ఫలితాలనిస్తాయి. కుటుంబసభ్యులు మీ అభిప్రాయాలను సగౌరవంగా ఆదరిస్తారు.

## పంచాంగం

### శుభ ముహూర్తాలు

3, 7, 9 తేదీలలో ఉ.7.30 గం.ల నుండి 9.00 వరకు మేష లగ్నాన.

3 తేదీ ఉ.9.00 గం.ల నుండి 10.00 వరకు వృషభ లగ్నాన.

3, 5, 7, 8 తేదిల్లో రా.8.00 గం.ల నుండి 9.30 వరకు తులాలగ్నాన సుముహూర్తాలున్నాయి.

### మార్చి తిథులు

చైత్ర బహుళ

| | | | | |
|---|---|---|---|---|
| 3 | శని | పంచమి | రా.11.46 | గం.ల.వ |
| 4 | ఆది | షష్ఠి | రా.12.31 | గం.ల.వ |
| 5 | సోమ | సప్తమి | రా.2.00 | గం.ల.వ |
| 6 | మంగళ | అష్టమి | తె.4.07 | గం.ల.వ |
| 7 | బుధ | నవమి | పూర్తిగా | |
| 8 | గురు | నవమి | ఉ.6.38 | గం.ల.వ |
| 9 | శుక్ర | దశమి | ఉ.9.16 | గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




ఆరోగ్యవిషయాలు ఊరటనిస్తాయి. సమాజంలో గౌరవ ప్రతిష్ఠలు ఇనుమడిస్తాయి. భవిష్యత్తు ఆర్థికాభివృద్ధికి మంచి పథకాలు వేస్తారు. ఇతరులకు అవసరమైన సహాయసహకారాలు అందిస్తారు. పుణ్యకార్యాలలో పాలు పంచుకొంటారు. ఉద్యోగులకు పై వారి పూర్తి సహకారం ఉంటుంది. రాజకీయులు సదాలోచనతో రంగంలోకి దిగుతారు. గృహిణులు కొంత ఊరటను పొందుతారు.




కుటుంబ సభ్యులు, పిల్లలతో ఉత్సాహంగా కానవస్తారు. ధనాదాయవిషయాలు చక్కగా ఉంటాయి. కొంత శ్రమతో బాటు మానసిక తొల్యత తగ్గవచ్చు. నమ్మకస్తులైన పనివాళ్లమూలంగా వ్యాపారులు లాభాలనార్జిస్తారు. భాగస్వాములు మంచి ప్రోత్సాహన్నిస్తారు. తలనొప్పి లాంటి చిన్న చిన్న బాధలుండవచ్చు. రాజకీయులకు పైవారి నుండి తగిన సానుభూతి ఆదరణ తగ్గవచ్చు.




వృత్తిలో ప్రోత్సాహకరమైన వాతావరణం ఉంటుంది. బదిలీలు మార్పిడులు అనుకొన్నరీతిలో జరిగే అవకాశాలున్నాయి. ఆంత్ర, ఆసన సంబంధమైన అనారోగ్యాల తీవ్రత వేదననిస్తుంది. బృంద కార్యక్రమాలు సాఫీగా జరుగకపోవచ్చు. దైవచింతన అవసరం. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. రాజకీయులు పైవారి ఆదరణకు పాత్రులౌతారు. నూతన ప్రయత్నాలు వాయిదా వేయడం మంచిది.




పథకాలు సత్ఫలితాలనిస్తాయి. అనుకొన్నవి అనుకొన్నరీతిలో సాగుతాయి. అడ్డుపడి ఆగిపోయిన పనుల్ని నింపాదిగా మరల ప్రారంభిస్తారు. ఉద్యోగాన్వేషణలోనున్న వారికి ఉద్యోగప్రాప్తి సూచితం. శుభకార్యాలకు వెచ్చిస్తారు. గృహోపకరణాలు, సౌకర్యాలు పెంచుకొంటారు. మీడియా ఉద్యోగులు జాగ్రత్తగా ఉండాలి. రాజకీయులకు సహసభ్యుల పోటీ ఉంటుంది.




సహోద్యోగుల విషయంలో ఆచితూచి అడుగేయాలి. ఎవరిని విమర్శించవద్దు. మిత్రులమూలంగా లాభార్జన. గృహం, నివేశన స్థలంకొనే యోచన ఫలిస్తుంది. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు ఊపందుకొంటాయి. ఇతరుల కోసం కొంత శ్రమ పడవలసి వస్తుంది. మంచి భవిష్యత్తుకై ప్రణాళికలు ఏర్పాటు చేస్తారు. రాజకీయులు ఉత్సాహంగా తమ పనులలో లీనమవుతారు.




వృత్తి ఉద్యోగాల్లో శ్రమాధిక్యత అనుభూతిలోనికి వస్తుంది. శుభకార్యాలకై వెచ్చిస్తారు. పుణ్యస్థలాలను దర్శిస్తారు. కుటుంబ సభ్యుల కోరికలను ఈడేరుస్తారు. విద్యార్థులు అతిశ్రమతో విద్యాభ్యాసం సాగించవలసివస్తుంది. సామాజిక సేవాకార్యాలలో మనసు పోనివ్వడం మంచిది. భాగస్వాముల తోడ్పాటు మంచి లాభాలకు దారి తీస్తుంది. స్పెక్యులేషన్ జోలికి పోవద్దు.

# మగపిల్లలపై ప్రభావం చూపే తూర్పు ఈశాన్య దోషం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*జెట్టిగుండ్ల సుభద్ర — తిరుపతి*

** వాస్తు సూత్రాలు బాగా తెలుసునని ఆయన ఇంటిని కట్టించారు. తీరా 'బాబు'కు ఆక్సిడెంట్ అయింది.*

మీరు పంపిన వాస్తు ప్లానులో చాలా దోషాలున్నాయి. తూర్పు ఈశాన్య దోషం ఇంటి కుమారులపై పనిచేస్తుంది. ప్రాథమిక సూత్రాలతో పాటు ఆయన్ను బ్రహ్మ, ఇంద్ర, నాభిస్థానాల్ని గురించి అధ్యయనం చేయమని చెప్పండి.

*ఎన్.ప్రద్యుమ్నారెడ్డి — ఉదయగిరి*

** యంత్రం, రత్నం జీవితకాలాన్ని గురించి 'కృష్ణవాస్తు' చెబుతుందా?*

వశిష్ఠుడి సమకాలికుడైన 'నిముష' మహర్షి కృష్ణవాస్తు కర్త ప్రపితామహుడు కూడా రత్న పరీక్షలో పేరెన్నికగన్న వారే.

*అరుణ భాటియా — నెల్లూరు*

** అబ్బాయి పరిస్థితి ఇది. సమస్యకు మంచి సలహా ఇవ్వండి.*

పశ్చిమ దిశాగృహ దోషాల్ని మొదట నివృత్తి చేయాలి. లక్ష్మీకృత వాస్తు యంత్రం ప్రతిష్ఠించుకోండి. బాబుకు 'ముత్యం' శ్రేష్ఠ చంద్ర ప్రభావాల్ని బలహీన పరచి ఒత్తిడులను తగ్గిస్తుంది.

*వై.ఆర్.శకుంతల — రేణిగుంట*

** ఇల్లు కట్టి సంవత్సరమయింది. అంతకు ముందు ఆర్థిక పరిస్థితి సంతృప్తికరంగా ఉండేది.*

కొత్త యింట్లో ఉత్తర వాయువ్య, ఈశాన్య దోషాల వల్ల మీ ఆర్థికస్థితి అతలాకుతలమయ్యింది. యంత్ర ప్రతిష్టలకంటే ముందు 'వాస్తు'ను పాటించి వుంటే బాగుండేది. పుట్టిన తేదీ పంపితే 'యంత్ర'మేమిటో తెలియబరుస్తాను.

*ఎన్.పరబ్రహ్మశాస్త్రి — చెన్నై*

** రాహు స్థితికి, శరీర ధర్మానికీ, రత్న ధారణకూ ఏదో రహస్యం ఉందని నమ్మకం?*

రాహువు 'గోమేధుక' శక్తికి లోబడి వుంటాడు. గోమేధుకంలోని 'వర్ణ' ప్రభావ కాంతి కిరణాలు శరీరంలోకి ప్రవేశించి 'దుష్టశక్తి' బహిష్కరణ కిరణాలై ప్రవర్తిస్తాయి. ఫలితం రాహు శక్తి నిర్వీర్యమవుతుంది.

*ఎం.దివాకరయ్య — గూడూరు*

** గూడూరు సొసైటీ కాలనీలో ఆర్థిక, ఆరోగ్యాలెందుకు చితికిపోతున్నాయి.*

వాయువ్య, నైరుతి, ఆగ్నేయ దోషాలు మూడు ఎక్కువే. నైరుతి వైపు స్మశాన తాంత్రిక వేధ ఎక్కువ. యంత్ర ప్రతిష్టలతో గృహాల్లో సమస్యలు పరిష్కరింపబడుతాయి.

*బి.వి.ఎన్.రమాకాంతరెడ్డి — నెల్లూరు*

** స్పిన్నింగ్ మిల్ ఏరియాలో ప్లాటు కొనాలని, మీ సలహా కోసం?*

అత్యంత వినాశకర వాస్తు దోషాలక్కడ తిష్ట వేశాయి. కోణ, దృష్టి, వేధల స్థావరం అది. మీ అభిప్రాయాన్ని మార్చుకోండి.

*కె.దీపికారెడ్డి — చెన్నై*

** చెన్నై వచ్చాక మళ్లీ ఇలా తేరుకుంటా మనుకోలేదు.*

మీరు తూర్పు దిశా దోషాల్ని సవరించుకొని 'యంత్ర ప్రతిష్ట' తర్వాత ఆర్థికంగా పుంజుకున్నారు. అంతే జరిగింది.

*దిగ్గజం కళావతి — విజయనగరం*

** ఇంటి ప్లాను, జాతకం పంపిస్తున్నాను. ఎలాగైనా మీరే సమస్యను పరిష్కరించాలి.*

తూర్పు లెట్రిన్, సెప్టిక్‌ట్యాంకు తీసివేసి దక్షిణ, పశ్చిమ ప్రహరీల్ని పన్నెండు అంగుళాల ఎత్తు చేయండి. యంత్ర ప్రతిష్ఠ విధిగా చేయండి. వైఢూర్యం(ప్రధమార్థ) ధరించండి.

*దివాణం ఉమాదేవి — బెంగుళూరు*

** మూలలు చూసే స్థలాన్ని కొనవచ్చా? కొంటే ఎలా సరిచేసుకోవాలి?*

అలాంటి స్థలాలు కొనకపోవడమే మంచిది. అథవా కొన్నా కొన్ని అడుగులు, అంకణాల స్థలాన్ని వదులుకోవాల్సి రావచ్చు.

# కోడూరులో తాగునీటికి కటకట!

జిల్లాలోని తోటపల్లి గూడూరు మండలం కోడూరు గ్రామ పంచాయితీ పాలకవర్గం నిర్లక్ష్యం, అధికారుల ఉదాసీనత కారణంగా అభివృద్ధికి దూరంగా వుంటుంది. ప్రజల చేత ఎన్నుకోబడిన పాలకవర్గంలో ఏర్పడిన రాజకీయ విభేదాల కారణంగా ఎవరు కూడా పంచాయితీలోని సమస్యల గురించి పట్టించుకోవడం లేదు. స్థానికంగా ఏర్పడిన సమస్యలు, అభివృద్ధిపనులు చేపట్టాలని ప్రజలు పలు దఫాలు విన్నవించుకున్నా ఫలితం లేకుండా పోయింది. పేరుకే మేజర్ పంచాయితీగా గుర్తింపు పొందినా మైనర్ గ్రామ పంచాయితీలో జరిగిన అభివృద్ధి పనులు కూడా జరగలేదంటే ఆశ్చర్యపోక తప్పదు.

కోడూరు గ్రామ పంచాయితీలో సర్పంచ్‌గా తెలుగుదేశం పార్టీకి చెందిన ఊటుకూరు శ్రీనివాసులు గెలుపొందారు. ఈ పంచాయితీలో ఎనిమిది వేల మంది జనాభా, రెండు వేల కుటుంబాలు, ఆరువేల మంది ఓటర్లు వున్నారు. ఇంటి పన్నుల రూపంలో మూడు లక్షల 60వేల రూపాయలు, ఎస్ఎఫ్‌సి, 12వ ఆర్థిక సంఘం నిధులు కలిపి మూడు లక్షల 90వేల రూపాయలు సమకూరుతుంటాయి. ఇవి కాకుండా సెస్సు రూపంలో మరో ఐదు లక్షల రూపాయలు వసూలు చేస్తారు. పంచాయితీ పరిధిలో మహాలక్ష్మీపురం, చెన్నపల్లి పాళెం, రవీంద్రపురం తదితర గ్రామాలు కలసి వున్నాయి. గ్రామ పంచాయితీకి సొంత భవనం లేకపోవడం రీడింగ్ రూమ్‌లో కార్యాలయాన్ని ఏర్పాటు చేశారు. ఇది కూడా పాడు బడిపోయిన భవనాన్ని తలపించే విధంగా కనిపిస్తుంది.

పంచాయితీలో ప్రధానంగా త్రాగునీటి సమస్యతో ప్రజలు ఇబ్బంది పడుతున్నారు. పంచాయితీ కార్యాలయానికి వచ్చి ఫిర్యాదు చేద్దామంటే సిబ్బంది ఎవరు వుండడం లేదని గ్రామస్తులు ఆరోపించారు. ఈ పంచాయితీకి రెగ్యులర్ కార్యదర్శిని నియమించక పోవడంతో మండపం గ్రామ పంచాయితీ కార్యదర్శిని ఇక్కడ ఇన్‌చార్జిగా నియమించారు. ఇతను రెండు పంచాయితీలలో బాధ్యతలు సక్రమంగా నిర్వహించలేక పోతున్నాడు. గ్రామంలోని వీధులలో సిమెంటు రోడ్లు నిర్మించకపోయినా కనీసం గ్రావెల్‌తోనైనా రోడ్లను వేయకపోవడంపై ప్రజలు ప్రశ్నిస్తున్నారు. గ్రామ సర్పంచ్‌గా బాధ్యతలు స్వీకరించి నాలుగున్నర సంవత్సరాలు గడిచినప్పటికీ పంచాయితీలో ఎటువంటి మార్పు కానరావడం లేదు. సర్పంచ్ ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీకి చెందినవాడు కావడం, మెజార్టీ వార్డు సభ్యులు కాంగ్రెస్ పార్టీకి చెందిన వారు కావడం వల్ల అభివృద్ధి పనులు చేపట్టే విషయంలో పొంతన లేకుండా పోతుంది. వీరి విభేదాల కారణంగా ప్రజలు ఇబ్బంది పడక తప్పడంలేదు. ఈ క్రమంలో పంచాయితీలోని సమస్యలపై స్థానికుల అభిప్రాయాలు ప్రకనిస్తున్నాం.



**త్రాగునీరు సరఫరా చేయాలి!**

మా గ్రామ పంచాయితీ పరిధిలోని పలు కాలనీలకు త్రాగునీరు సక్రమంగా సరఫరా కావడం లేదు. దీంతో ప్రజలు అనేక ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుంది. గ్రామ సర్పంచ్, పంచాయితీ కార్యదర్శులకు పలు దఫాలు విన్నవించుకున్నా సమస్య పరిష్కారం కాలేదు. జిల్లాస్థాయి అధికారులు స్పందించి త్రాగునీరు సరఫరాకు చర్యలు తీసుకోవాలి.

*– వెంకటరమణయ్య*



**సిబ్బంది కొరత!**

పంచాయితీ పరిధిలో అభివృద్ధి పనులు అమలు చేసేందుకు నా వంతు కృషి చేస్తున్నాను. రెండు గ్రామ పంచాయితీలలో బాధ్యతలు నిర్వర్తించడం కష్టతరంగా వుంది. ఒక్కడినే అన్ని పనులు చూసుకోవాల్సి వుంది. ఇంటి పన్నులు వసూలు చేసేందుకు బిల్ కలెక్టర్ కూడా లేదు. తాత్కాలిక సిబ్బంది ద్వారా పనులు చేయించుకోవాల్సి వుంటుంది.

*– జి.శ్రీనివాసులు ఇన్‌చార్జి కార్యదర్శి*



కోడూరు పంచాయితీ కార్యాలయం.



గ్రామంలో ఇసుక పేరుకున్న రోడ్డు.

అవినీతి కథ

# రాజీవ్ విద్యామిషన్‌లో ఆగని అక్రమాలు!





నెల్లూరులోని రాజీవ్ విద్యామిషన్ కార్యాలయం.

జిల్లా రాజీవ్ విద్యామిషన్ కార్యాలయంలో అవినీతి, అక్రమాలు మరింత ఊపందుకుంటున్నాయి. ఈ కార్యాలయంపై గతంలో అనేక అవినీతి ఆరోపణలు వచ్చినా ప్రభుత్వం వైపు నుంచి ఎటువంటి విచారణ లేకపోవడంతో అధికారులు, సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు. ఉన్నతాధికారులు ఎంతమంది మారినా కూడా ఈ కార్యాలయం పనితీరులో మాత్రం ఎటువంటి మార్పు కానరావడం లేదు. కంప్యూటర్ల కొనుగోలు, వికలాంగ విద్యార్థులకు వినికిడి పరికరాల కొనుగోళ్లలో, భవన నిర్మాణ కాంట్రాక్టు పనుల్లో లక్షలాది రూపాయల నిధులు దుర్వినియోగం జరిగాయి. ఈ విషయం అధికారులకు తెలిసినా కూడా ఇందుకు కారకులైన వారిపై చర్యలు లేకపోవడంతో మరిన్ని అవినీతి అక్రమాలకు కల్గిస్తున్నాయి.

తాజాగా ఇదే కార్యాలయంలో అవినీతి అక్రమాలు చోటు చేసుకున్నాయి. జిల్లాలో ఆర్‌బిసి స్కూళ్లలో విద్యనభ్యసించే విద్యార్థినీ, విద్యార్థులకు అందించే పుస్తకాలలో కూడా నిధుల దుర్వినియోగం జరిగింది. ఒకటవ తరగతి నుంచి ఏడవ తరగతి వరకు చదివే విద్యార్థులకు పుస్తకాలు సరఫరా చేసే బాధ్యతను కాంట్రాక్టర్‌కు అప్పగించింది ప్రభుత్వం. రాష్ట్రవ్యాప్తంగా అన్ని స్కూళ్లకు కొన్ని పుస్తకాలను మాత్రమే సరఫరా చేశారు. సామాన్య శాస్త్రం పుస్తకాన్ని మాత్రం సరఫరా చేయకుండానే చేసినట్లు ధృవీకరణ పత్రాలు జారీచేసి కమీషన్లు తీసుకుంటున్నారు. రాజీవ్ విద్యామిషన్ కార్యాలయంలో ఇందుకు సంబంధించిన సమాచారం అందించేందుకు నిరాకరిస్తున్నారు.

రాజీవ్ విద్యామిషన్ కార్యాలయంలో చోటుచేసుకొంటున్న అవినీతి, అక్రమాల కారణంగా ప్రభుత్వ సంకల్పం నెరవేరకుండా పోయే ప్రమాదం ఏర్పడింది. విద్యార్థులకు అందజేయాల్సిన పుస్తకాలను సైతం అందించకుండానే అందజేసినట్లు లెక్కలు చూపడం సిగ్గుచేటు. ఇది కేవలం జిల్లాకే పరిమితం కాలేదు. రాష్ట్రవ్యాప్తంగా రాజీవ్ విద్యామిషన్ ఆధ్వర్యంలో ఏర్పాటుచేసిన స్కూళ్లలో చోటు చేసుకుంది. ఈ కార్యాలయంలో పనిచేస్తున్న సిబ్బంది, అధికారులు ప్రభుత్వ నిధుల్ని స్వాహా చేయడంలో ఆరితేరిపోయి వున్నారు. సామాన్య, మధ్య తరగతికి చెందిన ప్రజలకు ఈ కార్యాలయంతో సంబంధాలుండవు.

కేవలం వివిధ రకాల పనులు, సామాగ్రిని సరఫరాచేసే కాంట్రాక్టర్లు నిత్యం ఈ కార్యాలయానికి రాకపోకలు సాగిస్తుంటారు. ఈ కార్యాలయం ద్వారా పనులు చేసిన కాంట్రాక్టర్లకు బిల్లులు నిబంధనల ప్రకారం చెల్లించడం లేదన్న ఆరోపణలున్నాయి. రాజీవ్ విద్యామిషన్ ఏ ఉద్దేశ్యంతో ఏర్పాటు చేయబడిందో ఆ ఉద్దేశాలను అధికారులు నీరుగారుస్తున్నారు. పాఠశాలలకు అదనపు గదుల నిర్మాణం, ప్రహరీ గోడలు, త్రాగునీటి వసతి, విద్యా వాలంటీర్లకు వేతనాలు, రెసిడెన్షియల్ బ్రిడ్జి కోర్సు స్కూళ్ల నిర్వహణకు నిధులు మంజూరు చేయడం వంటి కార్యక్రమాలు అమలు చేస్తారు.

అయితే బడి బయట వున్న పిల్లలను బడిలో చేర్పించడం మానేసి, ఏ పనులకు నిధులు మంజూరయ్యాయి? వీటిని ఖర్చుచేస్తే ఎంత కమీషన్ వస్తుంది? కాంట్రాక్టర్లకు చెల్లించే బిల్లుల్లో ఏ మేరకు కమీషన్ వసూలు చేయాలన్న దానిపై అధికారులు దృష్టి సారించి వున్నారు. ఈ శాఖకు సంబంధించిన కార్యకలాపాలన్నీ జిల్లా కలెక్టర్ అనుమతితో చేపట్టాల్సి వుంటుంది. జిల్లా కలెక్టర్ పరిపాలనాపరంగా నిత్యం బిజీగా వుండడంతో ఈ శాఖ కార్యక్రమాలను పరిశీలించలేక పోతున్నారు. దీనిని ఆసరా చేసుకున్న అధికారులు, సిబ్బంది చేతివాటం బాగా ప్రదర్శిస్తున్నారు.

ఇంతకు ముందు సర్వశిక్ష అభియాన్‌గా వున్న ఈ శాఖకు కాంగ్రెస్ ప్రభుత్వం అధికారం చేపట్టిన తర్వాత రాజీవ్ విద్యామిషన్‌గా పేరు మార్చడం జరిగింది. రాజీవ్ విద్యామిషన్ ప్రాజెక్టు అధికారిగా ఎవరిని నియమించినా ఏదో ఒక ఆరోపణపై అనతికాలంలోనే జిల్లా నుంచి బదలీ అవుతున్నారు. ఇటీవల పి.ఓగా బాధ్యతలు చేపట్టిన రమేష్‌కుమార్‌ను ఆయన మాతృ సంస్థ అయిన భూగర్భజల శాఖకు తిరిగి రమ్మని ప్రభుత్వం ఆదేశాలు జారీ చేసింది.





## ఇక్కడ ముద్దులు తప్పవు!

ఏమాయ చేసావె చిత్రంలో హీరోయిన్ సమంత యువతను విపరీతంగా ఆకట్టుకొంది. ఏకంగా ఎన్టీఆర్ సరసన 'బృందావనం' చిత్రంలో హీరోయిన్‌గా ఎంపికయ్యింది. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమె పిచ్చాపాటీగా మాట్లాడింది. మా నాన్న తెలుగువారు. అమ్మ మళయాళీ. కొన్నేళ్లుగా తమిళనాడులోనే స్థిరపడిపోయాం. కాలేజీలో వుండగా మోడలింగ్ చేసేదాన్ని. గౌతమ్‌మీనన్ పిలిచి మరీ 'ఏమాయ చేసావె'లో హీరోయిన్ చేశారు. ఈ చిత్రంలో నా నటనకు వస్తున్న ప్రశంసలన్నీ గౌతమ్‌మీనన్‌కే దక్కాలంది. తొలి సినిమాలోనే ముద్దు సీన్‌ను ఒప్పుకొన్న విషయాన్ని ప్రస్తావించగా సినిమా అనేది గ్లామర్ ప్రపంచం. పుస్తకాలు చేతిలో పట్టుకొన్నాక చదవనంటే కుదరదుకదా అని తెలివిగా సమాధానం చెప్పింది సమంత.

## కేసులో ఇరికించారు!

అటు సినిమాలు అటు టీవీ సీరియళ్లలో బిజీగా వుండే నటి భువనేశ్వరిని కొన్నాళ్ల క్రితం చెన్నై పోలీసులు వ్యభిచార నేరం క్రింద అరెస్ట్ చేశారు. ఇటీవల భువనేశ్వరి శ్రీకాంత్ హీరోగా తయారవుతున్న 'రంగ-ది దొంగ' సినిమా షూటింగ్‌లో పాల్గొనను హైదరాబాద్ వచ్చింది. ఈ సందర్భంగా పిచ్చాపాటీగా మాట్లాడుతూ ఎవరో కావాలని నన్ను ఈ



కేసులో ఇరికించారు. అదో దురదృష్టకర సంఘటన. మళ్లీ తిరగతోడద్దు. నేను ఆ సందర్భంలో ఏ రకమైన వ్యాఖ్యానాలు చేయలేదు. కాని కొందరు వాటిని సృష్టించారు. నన్ను బ్రతికించింది పరిశ్రమ. దానిలోని వారంతా నా కుటుంబ సభ్యుల్లాంటి వాళ్లేనని భావిస్తాను. అటువంటప్పుడు నా కుటుంబం గూర్చి తప్పుగా చెబుతానా అంది భువనేశ్వరి.

## దోశంటే ఇష్టం!



హ్యాపీడేస్ ఫేం హీరోయిన్ తమన్నాకు దోశంటే అమితిష్టం. ఇదే విషయాన్ని ఆమె వివరిస్తూ దోశ... ఈ మాట వింటుంటేనే నా నోరు ఊరిపోతుంది. ఇంట్లో అల్పాహారం ఏం చేసినా... నా చూపెప్పుడూ దోశెలపైనే వుంటుంది. సాధారణంగా ఇంట్లో చపాతీలే ఎక్కువగా తింటారు. కానీ నాకోసం వేడి వేడి దోశలు వేయాల్సిందే. నా స్నేహితులు తమ ఇళ్లకు రమ్మని ఆహ్వానం పలుకుతూ దోశల పిండి సిద్ధమంటారు. స్నేహితులు, దోశలను కాదనలేక అక్కడకు వెళ్లి వాలిపోతానంటుంది ఈ సుందరి. బాగుంది కదూ తమన్నా దోశల ముచ్చట.

## పోలికతో ఇబ్బంది!



ఉల్లాసంగా... ఉత్సాహంగా చిత్రంలో హీరోయిన్ స్నేహావుల్లాల్, ఐశ్వర్యరాయ్‌లా వుంటుందని జరిగిన ప్రచారం బాలీవుడ్‌లో తన కొంప ముంచిందంటుంది. స్నేహను సల్మాన్‌ఖాన్ ఐశ్వర్య రేంజికి తీసుక వెళ్తానంటూ ప్రతిజ్ఞ చేసి 'లక్' చిత్రంలో అవకాశమిచ్చాడు. కాని ఫలితం వికటించింది. దీంతో దక్షిణాదికి వచ్చిన స్నేహ కరెంట్, నేను మీకు తెలుసా చిత్రాల్లో నటించింది. ప్రస్తుతం సింహాలో బాలకృష్ణ సరసన నటిస్తుంది. తమిళంలోనూ పలు చిత్రాల్లో నటిస్తున్న స్నేహావుల్లాల్ బాలీవుడ్‌లో ఐష్‌తో పోలిక పెట్టడం వల్లే దెబ్బతిన్నానంటుంది. తెలుగు పరిశ్రమలో హీరోయిన్లను మర్యాదగా చూసుకొంటారని కితాబిచ్చింది.

## నవతరాన్ని ఆకట్టుకోవాలి!



చూపులు చురకత్తులుగా గల హీరోయిన్ బిపాసబసు. తన సోయగాలతో ఆమె కుర్రకారు మతి పోగొట్టేస్తుంది. ఈమె 'జిస్మ్' చిత్రంలో శృంగార రసాన్ని ఒలికించిన తీరును ఎవరూ మరచిపోలేరు. ఈ తరహా నటనలో తనకు జీనత్ అమన్ స్ఫూర్తి అంటోంది బిపాస. దేవానంద్ తీసిన హరే కృష్ణ చిత్రంలో ఆమె ఒలికించిన శృంగార భావనలు వర్ణనాతీతమంటుంది బిపాస. లీడర్ ఫేం రానా, అభిషేక్‌బచ్చన్లు హీరోలుగా నటిస్తున్న 'దమ్ మారో దమ్'లో బిపాస హీరోయిన్‌గా నటిస్తుంది. ఈ సినిమా పాత్ర విషయంలో జీనత్‌నే ఆదర్శంగా తీసుకుంటాను. అయితే ఒకటి మాత్రం నిజం ఎవరిని అనుకరించినా మనకంటూ ఓ ప్రత్యేకత వుండాలి. అది వున్నప్పుడే నవతరాన్ని ఆకట్టుకోగలమంటుంది ఈ బెంగాలీ భామ.

## మనసును తాకని – మరోచరిత్ర!



అల్లూరు రహీం

దరిదాపులు పాతికేళ్ల క్రితం దర్శకుడు కె.బాలచందర్ బ్లాక్ అండ్ వైట్‌లో తీసిన మరోచరిత్ర చిత్రం నేటికీ ఆపాతమధురమే. ఓ బ్రాహ్మణుల అబ్బాయి, క్రిస్టియన్ అమ్మాయిల ప్రేమను పెద్దలు ఒప్పుకోకపోవడంతో వాళ్లిద్దరు సముద్రంలోకి దూకి చనిపోతారు. బ్రాహ్మణుల అబ్బాయిగా కమల్‌హాసన్, క్రిస్టియన్ అమ్మాయిగా సరిత నటన, ఎం.ఎస్.విశ్వనాథన్ సంగీతం సమకూర్చిన పాటలు వింటుంటే ప్రేమసాగరంలో ప్రేమికుల హృదయాలు ఓలలాడుతాయి. అలనాటి మరోచరిత్ర కథ ఆధారంగా 'దిల్'రాజు నిర్మాతగా, వరుణ్ సందేశ్, అనితలను హీరో, హీరోయిన్లుగా పెట్టి తీసిన సరికొత్త మరోచరిత్రకు నక్కకు నాగలోకానికి వున్నంత తేడా వుంది. ఆధునిక టెక్నాలజీ, అమెరికాలోని అందమైన ప్రదేశాలు, నయాగర జలపాతం వద్ద ప్రేమ సన్నివేశాలు చిత్రీకరించినా ఈ చిత్రం యువ హృదయాలను గిలిగింతలు పెట్టలేకపోతోంది. తొలిచూపులోనే ప్రేమ పుట్టవచ్చు. ఆ పుట్టుక ఈ చిత్రంలో ఆకర్షణీయంగా లేదు. అదే విధంగా రెండు, మూడు రోజుల ప్రేమకే హీరో, హీరోయిన్‌ను ముద్దు అడగడం బాగోలేదు. తెలుగు మాట్లాడను రాని హీరో తెలుగు పాట పాడడం విడ్డూరమే. అదేవిధంగా హీరోయిన్, హీరోను దొంగనా కొడకా, రే చచ్చినోడా, గుద్దూతా వంటి తిట్లు తిట్టడం సినిమా చూస్తున్న యువతకే అతిగా తోస్తుంది. అయితే దేవుడు జత కలిపే ప్రేమికుల హృదయ స్పందన ఒకటేనని చాటి చెప్పే సన్నివేశం, ప్రేమికుల వీడియో కాన్ఫరెన్స్‌లు అలరిస్తాయి. మిక్కీ జె.మేయర్ పాత మరోచరిత్రలోని ఏ తీగ పువ్వునో..., భలే భలే మగాడివోయ్ పాటలను రీమిక్స్ చేసిన తీరు బాగోలేదు. చిత్రంలోని మిగతా పాటలు అర్థమే కావు. అయితే ఈ పాటల్లో ఇప్పటివరకు తెలుగు చిత్రాల్లో చూపని అమెరికాలోని లొకేషన్స్ చూసి ఆనందించవచ్చు. సినిమాలోని డైలాగుల్లో దేవుడు అడగకుండానే అన్నీ ఇస్తాడు... చెప్పకుండానే తీసుకెళ్తాడు. బాధ మన లైఫ్ పార్టనర్. స్వచ్ఛమైన ప్రేమ ముందు కాలమెంత? హృదయాన్ని తాకుతాయి. ఈ చిత్ర దర్శకుడు రవియాదవ్ వాస్తవానికి కెమెరామెన్. ఆయన కెమెరా మీద శ్రద్ధపెట్టడం వల్ల 'మరోచరిత్ర' చిత్రంలో అజరామర ప్రేమ కనిపించలేదనాలి.

చిత్ర కథలోనికి వెళ్తే న్యూయార్క్‌లో ఇరుగు పొరుగున వుంటారు ప్రతాప్‌పోతన్, జానకి, తలైవాసన్ విజయ్, ఊర్వశి దంపతులు. వీరి పిల్లలే బాలు(వరుణ్ సందేశ్), స్వప్న(అనిత)లు. ప్రతాప్ పోతన్, ఊర్వశిలకు ఎప్పుడూ జగడాలే. కానీ జానకి, తలైవాసన్ విజయ్‌లు మంచి మనుషులు. యూనివర్శిటీలో చదువును అర్థాంతరంగా ముగించి వచ్చే బాలుకు స్వప్న విచిత్రంగా తారసపడుతుంది. తొలిచూపులోనే వీరి హృదయాలు కలుస్తాయి. మూడో రోజునుంచి మాటలు, ఐదో రోజు షికార్లు, ఆరవ రోజు పబ్బులు. అక్కడ బాలు, స్వప్నకు ముద్దు ఇవ్వడంతో హద్దులు గుర్తుకు వస్తాయి. అయినా ప్రేమికులు సర్దుకొంటారు. ఇళ్లలో వీడియో కాన్ఫరెన్స్ లింకులతో వీరి ప్రేమ తల్లితండ్రులకు తెలుస్తుంది. మటన్ ఫ్యామిలీతో ప్రేమేమిటని ప్రతాప్‌పోతన్ అగ్గిమీద గుగ్గిలమవుతాడు. అయినా ప్రేమికులిద్దరూ లేచిపోను సిద్ధపడతారు. అమెరికాలో పోలీసు పంతులు(నరేష్) పెద్దలిద్దరిని కూర్చోబెట్టి ఓ ఏడాది ప్రేమికులిద్దరూ కలుసుకోకూడదని, అప్పుడే పెళ్లని అగ్రిమెంట్ వ్రాయిస్తాడు. మరోచోట ఉద్యోగంలో కుదిరిన బాలుకు జీవితంలో ప్రేమికుడ్ని కోల్పోయిన సంధ్య(శ్రద్ధాదాస్) తారస పడుతుంది. ఈ సమయంలోనే బాలు, స్వప్నల మధ్య వారి బావ మ్యాడి విలన్‌గా దూసుకవస్తాడు. ఇద్దరి మధ్య పొరపొచ్చాలు సృష్టించే ప్రయత్నం చేస్తాడు. ప్రేమికులు కలవకూడదన్న ఏడాది అగ్రిమెంట్ ముగుస్తుంది. అయినా తల్లితండ్రులు వీరి ప్రేమను అంగీకరించరు. వెంటనే ప్రేమికులిద్దరూ పెద్దలను నిందిస్తూ నయాగర జలపాతంలో దూకేస్తారు. వీళ్లు చనిపోయారని సీట్లలో నుంచి లేచిన ప్రేక్షకులకు జీవించి కనువిందు చేస్తారు.




చిత్రంలో అమెరికా అబ్బాయిగా వరుణ్‌సందేశ్ నటన పరవాలేదు. హీరోయిన్ అనిత పెద్దగా ఆకట్టుకోలేదు. కాని శ్రద్ధాదాస్ పాత్రను మాత్రం దర్శకుడు శ్రద్ధగా చిత్రీకరించాడు. గయ్యాళి గంగగా ఊర్వశి పరవాలేదు. ఎన్ని కొత్తహంగులున్నా 'మరోచరిత్ర' యువ హృదయాలను తాకలేదనాలి.



3జి సేవలను వివరిస్తున్న టెలికాం జి.ఎం.గోపి.

# అందుబాటులో 3జి సర్వీసులు

మొబైల్ ఫోన్ల వినియోగంలో ఒక నూతన అధ్యాయానికి 3జి సర్వీసులు తెరలేపనున్నాయి. థర్డ్ జనరేషన్ యువతల క్రేజ్ సంపాదించాయి. అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని కల్గి వుండడమే 3జి ఫోన్ల ప్రత్యేకత. ఇప్పటివరకు సమాచారాన్ని ఇతరులతో పంచుకోవడానికి, సంభాషించడానికి, మల్టీమీడియా, వీడియో, ఆడియో, టచ్‌స్క్రీన్‌కు, మొదటి, రెండవతరం ఫోన్లు పనికి వచ్చేవి. ఒకరినొకరు ఫోన్లలో చూసుకుంటూ మాట్లాడుకొనేందుకు, టీవి ఛానళ్లను సెల్‌ఫోన్‌లో వీక్షించేందుకు, ఇంటర్నెట్ లాంటి అత్యాధునిక సాంకేతిక అంశాలు ఇమిడి వుండేదే 3జి. దేశంలోని పలు రాష్ట్రాల్లో సమాచార విప్లవాన్ని సృష్టించిన ఈ ఫోన్లు ఇప్పటికే మన రాష్ట్రంలోని ప్రధాన నగరాలలో అందుబాటులోకి వచ్చాయి. నెల్లూరులోనూ ఈ నెల 30వ తేదీ నుంచి అందుబాటులోకి వచ్చింది. బిఎస్ఎన్ఎల్ సంస్థ మాత్రమే ఈ 3జి సేవలను వినియోగించుకోనుంది. అయితే 3జి సర్వీసులకు అన్నిరకాల సెల్‌ఫోన్లు పనిచేయవు. అందుకోసం 3జి సెల్ ఫోన్లు, యుసిమ్ కార్డులను మాత్రమే ఉపయోగించాల్సి వుంటుంది. ఈ సర్వీసులు కావాలనుకొన్న వినియోగదారులు బిఎస్ఎన్ఎల్ నుంచి యు సిమ్ కార్డులను కొనుగోలు చేయాల్సి వుంటుంది. సిమ్ కార్డులను 3జి హ్యాండ్‌సెట్‌లో అమర్చడం ద్వారా ఆ పరిజ్ఞానాన్ని ఉపయోగించుకోవచ్చు. ప్రీ పెయిడ్, పోస్టుపెయిడ్ సౌకర్యాలు ఇందులోను అందుబాటులో వున్నాయి. వినియోగాన్ని బట్టి బిల్లుల చెల్లింపు వుంటుంది. ఈ 3జి ఫోన్ల ద్వారా వీడియో కాన్ఫరెన్సు నిర్వహించవచ్చు. బ్రాడ్ బ్యాండ్, ఇంటర్నెట్ సదుపాయం, ఆన్‌లైన్ గేమింగ్ లాంటి సదుపాయాలతోపాటు టివి ఛానళ్లు చూడడం, మ్యూజిక్, వీడియో డౌన్‌లోడింగ్ చేసుకోవచ్చు. ఈ సర్వీసులను నగర వాసులకు అందించేందుకు 22 ప్రాంతాల్లో 3జి పరికరాలను అధికారులు ఏర్పాటు చేశారు.

# ప్రభవ ద్వితీయ వార్షికోత్సవం!



ప్రభవలో కొలువుతీరిన విభిన్న సాహిత్యం.

పిల్లలకు, పెద్దలకు విజ్ఞానాన్ని అందించేందుకు, వివిధ కళాకారులు తయారుచేసిన కళాకృతులను పరిచయం చేసేందుకు నెల్లూరు పొగతోటలో ఏర్పాటుచేసిన ప్రభవ ద్వితీయ వార్షికోత్సవం చేసుకొంటుంది. ప్రఖ్యాత రచయితల పుస్తకాల మొదలు పిల్లలకు కావాల్సిన బొమ్మలు, తాటాకులపై వేసిన పెయింటింగ్‌లు, బాపు బొమ్మలు, జనపనారతో తయారుచేసిన వివిధ వస్తువుల సమాహారం ప్రభవ. ప్రముఖ రచయిత్రి చంద్రలత దీనిని ఏర్పాటు చేశారు. స్థాపించిన నాటి నుంచి నేటి వరకు ఎన్నో కార్యక్రమాలకు వేదిక అయింది ప్రభవ. పుస్తకాలు, వస్తువులు దొరికే స్థలంగా మాత్రమేకాక సమాజాన్ని చైతన్య పరచే చర్చావేదికలు, పిల్లలకు వేసవి శిక్షణా శిబిరాల లాంటివి ఎన్నో ఇక్కడ నిర్వహించారు. గ్రీష్మ ప్రభవ పేరుతో పిల్లలకు చిత్రలేఖనం, హస్తకళల్లో శిక్షణా శిబిరాన్ని ఏర్పాటు చేశారు. తమ ఆటపాటలతో విద్యార్థుల్లో ప్రతిభను వెలికితీసేందుకు పిల్లలకు జేజే కార్యక్రమాన్ని, పసల భీమన్న ఆధ్వర్యంలో ఇంద్రజాల ప్రదర్శనను నిర్వహించారు. ప్రభవ ట్రినిటి కాలేజి ఆఫ్ లండన్ నిర్వహణ కేంద్రంగా గుర్తింపబడింది. మీట్ ది జర్నలిస్ట్, మీట్ ద ఎడ్యుకేషనిస్ట్ తదితర కార్యక్రమాలలో విద్యార్థులను భాగస్వామ్యం చేశారు. మేరీజాఫర్స్, శ్యాండీ హ్యాప్టన్ ఆధ్వర్యంలో వివిధ పరీక్షలు జరిగాయి. బిటి వంకాయపైన శాసనమండలి సభ్యుడు బాల సుబ్రమణ్యం, డాక్టర్ విజయకుమార్ తదితరులు చర్చాగోష్టి నిర్వహించి మంచి చెడులను విశ్లేషించేందుకు ప్రభవ నిర్వాహకులు వేదికను ఏర్పాటు చేశారు. ఇలాంటి విద్యార్థుల మేధస్సుకు, సమాజానికి ఉపయోగపడేలా అంశాలపై చర్చిస్తూ వివిధ కళారూపాలు, పుస్తకాలను నగర వాసులకు అందిస్తూ ఎంతో దగ్గరైంది ప్రభవ.

# ప్రశాంతంగా జడ్పీ సమావేశం!



జడ్పీ మీటింగ్‌లో జిల్లా కలెక్టర్ రాంగోపాల్, ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి.

ఎప్పుడూ వివాదాంశాలతో కొనసాగే జిల్లా పరిషత్ సర్వసభ్య సమావేశం ఈ దఫా ప్రశాంతంగా జరిగింది. మార్చి 28వ తేదిన నిర్వహించిన జడ్పీ సర్వసభ్య సమావేశంలో ఎటువంటి ఆరోపణలు, విమర్శలు చోటుచేసుకోలేదు. విద్యుత్‌శాఖ, గ్రామీణ నీటిసరఫరా, దేవాదాయశాఖ కార్యకలాపాలపై సమీక్ష నిర్వహించే విధంగా పొందు పరిచారు. జిల్లాలోని ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు, పార్లమెంటు సభ్యులు ఆశించినమేర హాజరుకాలేక పోయారు. గూడూరు, కావలి, వెంకటగిరి, సూళ్లూరుపేట, ఉదయగిరి ఎమ్మెల్యేలు బల్లి దుర్గా ప్రసాద్‌రావు, పరసా వెంకటరత్నం, కురుగొండ్ల రామకృష్ణ, మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి, బీద మస్తాన్‌రావులు హాజరయ్యారు. తిరుపతి ఎమ్పీ చింతామోహన్ ఒక్కరు మాత్రమే హాజరు కాగా, నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డితో పాటు ఆనం బ్రదర్స్, ఆదాల ప్రభాకర్‌రెడ్డి గైర్హాజరయ్యారు. సమావేశానికి హాజరైన జడ్పీటీసిలు, మండల పరిషత్ అధ్యక్షులు అజెండాలోని అంశాలపై పెద్దగా చర్చించలేక పోయారు. ఉదయం 10.30 గంటలకు ప్రారంభం కావాల్సిన సమావేశం అర్థగంట ఆలస్యంగా ప్రారంభమైంది. తెలుగుదేశం పార్టీకి చెందిన నలుగురు ఎమ్మెల్యేలు అజెండాలోని అంశాలపై చర్చించడంలో తమ హవా చాటుకున్నారు. అధికార పక్షానికి చెంది ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి ఒకరు మాత్రమే హాజరు కావడంతో ఎక్కువ మాట్లాడలేకపోయారు. తిరుపతి పార్లమెంటు సభ్యులు చింతామోహన్, కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావుల మధ్య కొద్దిసేపు మాటల యుద్ధం చోటుచేసుకొంది. వెనుకబడిన తరగతుల వారి సంక్షేమంపై చర్చ జరుగుతున్న సమయంలో బిసిల అభివృద్ధికి ప్రభుత్వం నిధులు కేటాయించడంలేదని బీద మస్తాన్‌రావు ఆరోపించారు. దీనికి స్పందించిన ఎమ్పీ చింతామోహన్ టిడిపి హయాంలో కంటే కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలోనే బిసిల సంక్షేమానికి అధిక శాతం నిధులు కేటాయించినట్లు చెప్పుకొచ్చారు. దీంతో ఇరువురి మధ్య కొద్దిసేపు వాగ్వివాదం జరిగింది. గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్‌రావు కల్పించుకుని ఇరువురికి సర్దిచెప్పడంతో వివాదానికి తెరపడింది. జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి అధ్యక్షతన జరిగిన ఈ సమావేశంలో దేవాదాయ శాఖకు సంబంధించిన పూర్తి సమాచారం లేకపోవడం వల్ల వాయిదా వేయడం జరిగింది. మిగిలిన అంశాలపై మూడు గంటలపాటు చర్చించారు. వేసవికాలం రావడంతో గ్రామీణ ప్రాంతాలలో త్రాగునీటి ఎద్దడి లేకుండా అన్ని చర్యలు తీసుకోవాలని సమావేశం తీర్మానించింది. ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ రాంగోపాల్, సిఇఓ రామిరెడ్డి, వివిధ శాఖలకు చెందిన అధికారులు పాల్గొన్నారు.

డాక్టర్ సలహా

# వేసవిలో చిన్నపిల్లల పట్ల శ్రద్ధ చూపాలి!



డాక్టర్ వి.జయకుమార్‌రెడ్డి,
ఛైల్డ్‌ట్రస్ట్ హాస్పిటల్ - చెన్నై

వేసవికాలంలో పిల్లకు పలు రకాల అంటువ్యాధులు సోకే ప్రమాదముందని మద్రాస్‌లో చిన్నపిల్లల వైద్యరంగంలో పేరుగడించిన డాక్టర్ జయకుమార్‌రెడ్డి తెలిపారు. చైల్డ్‌ట్రస్టు హాస్పిటల్‌లో సేవాభావంతో పనిచేస్తున్న ఆయన అపోలో హాస్పిటల్‌లోనూ పనిచేస్తున్నారు. నగరంలో ఏర్పాటుచేసిన అపోలో సెంటర్‌లో డాక్టర్ జె.కె.రెడ్డి నెల్లూరీయులకు అందుబాటులో వుంటున్నారు. ఈ సందర్భంగా ఆయన పిల్లలపట్ల వేసవిలో తీసుకోవాల్సిన జాగ్రత్తలపై పలు సూచనలు చేశారు. ఎండాకాలం లో మొదటగా పిల్లలకు సోకేవి ఆటలమ్మ, తట్టు. ఈ రెండు వ్యాధులు ఒకరి నుంచి మరొకరికి సులభంగా సోకుతాయి. వీటిని రాకుండా నివారించేందుకు వ్యాక్సిన్లను పిల్లలకు వేయించడం అత్యవసరం. ఎండ వేడిమి నుంచి ఉపశమనం పొందేందుకు స్విమ్మింగ్ చేయడం, నీళ్లలో ఎక్కువ సేపు సేదతీరేందుకు చిన్నపిల్లలు ఇష్టపడుతుంటారు. దీని వలన పలు రకాల వ్యాధులు పిల్లలను చుట్టుముడతాయి. ముఖ్యంగా నీరు నిల్వ వుండటం, సక్రమంగా శుభ్రపరచక పోవడం వలన, క్లోరినేషన్ చేయక పోవడం వల్ల డయేరియా వ్యాధికి గురయ్యే ప్రమాదం వుంది. దోమలు అధికం కావడం వల్ల చికున్‌గున్యా, డెంగ్యూ లాంటి వ్యాధులు సోకే అవకాశాలు అధికం. ఆశ్చర్యపరచే విషయం చలికాలంలో వచ్చే జలుబు, ఫ్లూలాంటి వ్యాధులు పిల్లలకు అధికంగా వేసవిలో రావడం, ఎండ వేడిమి నుంచి రక్షణ కోసం చిన్నపిల్లలను గుడ్డలతో కవర్ చేయడం మంచిది కాదు. గాలిసోకక డీహైడ్రేషన్‌కు గురయ్యే అవకాశం వుంది. గాలి తగిలేలా వదులుగా వుండే కాటన్ దుస్తులను పిల్లలకు వేయాలి. ఐస్‌క్రీమ్‌లు, ఐస్ లాంటి ఆహార పదార్థాల నుంచి పిల్లలను దూరంగా పెట్టాలి. ఉష్ణోగ్రత కారణంగా బ్యాక్టీరియా తన ప్రభావాన్ని అధికంగా చూపుతుంది కాబట్టి నిల్వవున్న ఆహార పదార్థాలను పిల్లలకు పెట్టకపోవడం ఉత్తమం. శరీరంపై దద్దుర్లు రావడం, కండరాల నొప్పులు, ఊపిరి ఆడకపోవడం లాంటివి పిల్లలకు ఎదురౌతుంటాయి. దీనిని గుర్తించి చల్లని ప్రదేశాలలో పిల్లలను సంరక్షించాలి. చేతులను శుభ్రంగా వుంచుకోవడం ప్రధానం. ఆహారం తినే ముందు సబ్బుతో చేతులను కడుక్కోవడం వల్ల చాలా వరకు జబ్బులను నివారించవచ్చు. దోమల నుంచి పిల్లలను జాగ్రత్త చేయాలి. ఈ జాగ్రత్తలు తీసుకొన్నట్లయితే వేసవి కాలంలో పిల్లలు ఆరోగ్యంగా వుంటారు.



జైన్‌గోల్డ్‌లో జరిగిన నాల్గవ డ్రాలో విజేతను ప్రకటిస్తున్న రత్నం విద్యాసంస్థల అధినేత కె.వి.రత్నం. ప్రక్కన ఆయన సతీమణి పద్మావతి రత్నం, జైన్‌గోల్డ్ అధినేత మణిలాల్ జైన్.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### ఔను వాళ్లిద్దరూ ఒకటయ్యారు!

పక్షం రోజుల క్రితం జరిగిన తెలుగుదేశం పార్టీ నెల్లూరు నగర సమీక్షా సమావేశంలో కొట్టుకొన్న రమేష్‌రెడ్డి, కిలారి వెంకటస్వామి నాయుడు ఒకటై, ఒకరినొకరు పొగడుకోవడం చూసినవాళ్లు ఆశ్చర్యపోవాల్సివచ్చింది. తెలుగుదేశం ఆవిర్భావ దినోత్సవాన్ని పురస్కరించుకొని 29తేదీ నర్తకి సెంటర్‌లోని ఎన్టీఆర్ విగ్రహం వద్ద నివాళులర్పించిన ఈ నేతలిద్దరూ ఒకరి నొకరు తెగ పొగుడుకొన్నారు. రమేష్‌రెడ్డి దంపతుల పాలనలో నెల్లూరు నగరంలో అభివృద్ధి పనులు బ్రహ్మాండంగా జరిగాయని కిలారి వెంకటస్వామినాయుడు చెప్పగా,నాయుడు నగరంలో పార్టీ అభివృద్ధికి కృషి చేస్తున్నారని రమేష్‌రెడ్డి చెప్పడం విన్నావారు కాస్త గందరగోళంలో పడ్డారు.

### కృష్ణచైతన్యకు షోకాజ్ నోటీసు!

ఇంటర్ ప్రశ్నపత్రాలను లీక్ చేస్తూ పట్టుబడ్డ కృష్ణచైతన్య జూనియర్ కళాశాల నిర్వాహకులకు బోర్డు వున్నతాధికారులు షోకాజ్ నోటీసులు జారీ చేశారు. ప్రశ్నాపత్రాల లీకేజికి బాధ్యులైన కాలేజి గుర్తింపు ఎందుకు రద్దు చేయకూడదో 15 రోజుల్లో తెలియజేయమని ఈ నోటీసులో కోరారు.

### పల్లెపాడు ఆశ్రమానికి విరాళమిచ్చిన పార్వతమ్మ!

ఇందుకూరుపేట మండలంలోని పల్లెపాడు పినాకిని ఆశ్రమ అభివృద్ధికి కావలి మాజీ శాసన సభ్యురాలు మాగుంట పార్వతమ్మ ఐదులక్షల రూపాయలు విరాళంగా ప్రకటించారు. ఆశ్రమంలో ఉచిత హిందీ శిక్షణా తరగతులను పార్వతమ్మ ప్రారంభించారు.

### మైండ్ సెట్ మార్చుకోమన్న కలెక్టర్!

మీ మైండ్ సెట్ మార్చుకోండి... మానవీయ కోణంలో ఆలోచించమని జిల్లా కలెక్టర్ రాంగోపాల్ బ్యాంకర్లకు క్లాసు తీసుకొన్నారు. 27తేది జరిగిన బ్యాంకర్ల సమావేశంలో కలెక్టర్ మాట్లాడతూ రుణాల కోసం వచ్చే పేదలను పదే పదే తిప్పుకోవడం మంచిది కాదు. దీనివల్ల ప్రభుత్వ పథకాలు పేదలకు అందకుండా పోతున్నాయని ఆవేదన వ్యక్తం చేశారు.

### పోలీసు బదలీలు

జిల్లాలో పోలీసు బదలీలకు రంగం సిద్ధమయ్యింది. చాలా రోజులుగా ఒకే స్టేషన్‌లో పాతుకపోయిన కానిస్టేబుళ్లను బదలీ చేయాలన్న నిర్ణయానికి ఎస్పీ వచ్చినట్లుంది. బదలీల జాబితాలో 500మంది పైగా కానిస్టేబుళ్లు 20 మందికిపైగా ఎస్ఐలుండవచ్చు. నెల్లూరు నగరంలోనే కానిస్టేబుళ్లు ఆరుస్టేషన్లు తిరుగుతూ సర్వీసు మొత్తం పూర్తి చేస్తున్నారన్న భావనకు ఎస్పీ వచ్చినట్లు తెలిసింది.

### వేటు పడింది!

కృష్ణచైతన్య కళాశాల యాజమాన్యంతో కుమ్మక్కై ఇంటర్ ప్రశ్నాపత్రాలు లీకేజికి కారణమయ్యారన్న ఆరోపణల మధ్య రీజినల్ ఇంటర్మీడియట్ అధికారి (ఆర్ఐఒ) డేవిడ్‌ను ప్రభుత్వం బదలీ చేసింది.

### ఆదాలను సత్కరించిన గవర్నర్

పల్లెపాడు గాంధీ ఆశ్రమం అభివృద్ధికి కృషి చేసిన సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి 30 తేది హైదరాబాద్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో గవర్నర్ రంగరాజన్ సత్కరించారు. ఆశ్రమం అభివృద్ధికి ఆదాల ప్రభాకర్‌రెడ్డి పదిలక్షల రూపాయలు విరాళమందించారు.

### కవి మోనా మరణం

ప్రముఖ కవి, సాహితీవేత్త మోహన్ నాగేశ్వర రావు (మోనా) గతవారం నెల్లూరులో మరణించారు. గత కొంత కాలంగా అనారోగ్యంతో బాధ పడుతున్నారాయన. మోనా 40ఏళ్ళ ఉపాధ్యాయునిగా పని చేశారు. కవితా రచనల్లో మహాకవి ఆశాన్ అవార్డు, కుందుర్తిపేరిట ఆంధ్రప్రదేశ్ పత్రిక ఇచ్చే అవార్డు, కేరళ ప్రభుత్వం ఇచ్చే అంతర్జాతీయ అవార్డులు సైతం పొందారు.





బుచ్చిరెడ్డిపాళెంలో కోదండరామస్వామి రథోత్సవం.

## ప్రత్యక్ష జగడం

16వ పేజీ కొరవ

ఏ చిన్న సంఘటన జరిగినా దానికి తనే బాధ్యుడినని ఇంటెలిజెన్స్ అధికారుల చేత నివేదికలు పంపుతున్నాడని జగన్ బాధ పడుతున్నాడు.

తాజాగా హైదరాబాద్ మత కల్లోలాల విషయంలోనూ ఇదే జరుగుతున్నదని జగన్ ఆక్రోశం. తనకు పరిస్థితి వివరించడానికి వచ్చే పోలీసు ఉన్నతాధికారుల వద్ద, ఈ హింస వెనుక కాంగ్రెస్ నేతల హస్తం వుందని అందరూ చెప్పున్నారే అని నేరుగా ప్రస్తావిస్తున్నాడట రోశయ్య. ఆ ప్రకారం కేంద్రానికి నివేదికలు పంపారా అని కూడా అడుగుతున్నాడట. అంటే, జగన్‌తో ప్రత్యక్ష యుద్ధానికి ముఖ్యమంత్రి సన్నద్ధుడౌతున్నాడని భావించవచ్చునన్న మాట. గతంలో డాక్టర్ మర్రి చెన్నారెడ్డిని పదవి నుంచి దించడానికి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి పాత బస్తీలో మత కల్లోలాలు సృష్టించాడని ఒక ఆరోపణ వుంది. ప్రతిపక్షాలు కొన్ని వందలసార్లు ఈ అంశాన్ని గుర్తు చేసి మరీ వైఎస్ మీద బురద చల్లేవి. ఇప్పుడు జగన్ కూడా అదేరకమైన ఆరోపణ ఎదుర్కోవాల్సి రావడం దురదృష్టకరం.

మొత్తం మీద జగన్ పేరు చెప్తేనే మండిపడుతున్నాడు రోశయ్య. మంచి కసి మీద వున్నాడు. అది ఆయన స్వంత కోపమా లేక కాంగ్రెస్ పెద్దలు ఆ ప్రకారం ఆదేశించారా అన్నది తెలియదు. వీరిద్దరి మధ్య రాజీకి కడప జిల్లా కాంగ్రెస్ ఎమ్మెల్యేలు చేసిన ప్రయత్నం విఫలమైంది. రాయలసీమ ఐజితో తమకు ఇబ్బందులు వస్తున్నాయని, ఆయన్ను బదలీ చేయాలని కోరడానికి కడప జిల్లాలో జగన్ స్వంత మనుషులైన ఆదినారాయణరెడ్డి, శ్రీకాంత్‌రెడ్డి, కమలమ్మ తదితరులు ముఖ్యమంత్రిని కలిశారు. అక్కడ సహజంగానే జగన్ వ్యవహారశైలి మీద చర్చ వచ్చింది. రోశయ్య మనసులోని కష్టాన్ని గమనించిన ఎమ్మెల్యేలు, మీరు సరే అంటే జగన్‌తో ఒక విందు సమావేశం ఏర్పాటుచేస్తామని అపోహలేవైనా వుంటే మాట్లాడుకొని సర్దుబాటు చేసుకోవచ్చునని ప్రతిపాదించారట. దానికి రోశయ్య ఔనన లేదు, కాదనీ చెప్పలేదు. తీరిక దొరికితే మీరు పెట్టే విందు సమావేశానికి వస్తానని మాత్రం చెప్పి తప్పించుకొన్నాడు. అయితే జగన్ మాత్రం దానికి ఇష్టపడలేదు. తనతో మాట మాత్రం చెప్పకుండా ముఖ్యమంత్రితో రాయబారం ఎవరు జరపమన్నారని కోపపడ్డాడట ఆయన. దానితో ఆ ఎమ్మెల్యేలు మళ్లీ ఆ ప్రస్తావన తేకుండా గమ్మునుండిపోయారు.

## జనవాణి

2వ పేజీ కొరవ

ఎసి బొమ్మ దగ్గరకు రానివ్వకుండా గాంధీబొమ్మ నుండి నేరుగా సుబేదారుపేట మీదుగా కనకమహల్ దగ్గర వున్న పుచ్చలపల్లి సుందరయ్య విగ్రహం దగ్గర నిలవాలి. సిటీబస్సులు నిర్ణయించిన స్టాపింగుల దగ్గరే ఆపేలా చర్యలు తీసుకోవాలి. ఈ బస్సులకు స్పీడు మీటర్లు బిగించాలి. ఆర్టీసి, మాగుంట సుబ్బ రామిరెడ్డి విగ్రహం వద్ద 'యు' టర్నింగులు పెట్టారు. ఎసి మార్కెట్ వద్ద పండ్లు, కూరగాయలు అమ్మే వారిని నియంత్రించాలి. ప్రజలకు ట్రాఫిక్‌పై అవగాహన కలిగేలా ప్రత్యేక కార్యక్రమాలు ఏర్పాటు చేయాలి.

*వొమ్మిన సుబ్రహ్మణ్యం, నెల్లూరు*

## శాపమా? పాపమా?

తొమ్మిదవ వేతన సవరణ సంఘం తమ నివేదికలో కమ్యూటేషన్ వాల్యుని తగ్గించడం దురదృష్టకరం. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అన్ని రంగాలలో పురోగమనదిశలో పయనిస్తూ, దేశంలోనే అగ్రగామిగా వుంది. ప్రస్తుత తరుణంలో ఎంతోకాలంగా కొనసాగుతున్న వాల్యూని పెంచవలసిందిపోయి, 10.46 శాతం నుంచి 8.371కి తగ్గించడం భావ్యం కాదు. 30ఏళ్లకు పైగా ప్రత్యక్షంగా గానీ పరోక్షంగా గాని ప్రభుత్వానికి, ప్రజలకు సేవలందించి వుద్యోగ విరమణ ఒకింత మానసిక వేదనకు తోడు గోరు చుట్టుపై రోకటిపోటులా ఈ వాల్యూ తగ్గించడం శోచనీయం.

*ఎ.సుధాకర్‌రావు, విద్యానగర్*

# అధికారుల నిర్లక్ష్యంపై ఎమ్మెల్యేల ఆగ్రహం!

జిల్లాలో వివిధశాఖల ఆధ్వర్యంలో చేపడుతున్న అభివృద్ధి పనులను పర్యవేక్షించి అమలు చేయడంలో అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని పలువురు ఎమ్మెల్యేలు ధ్వజమెత్తారు. మార్చి 28వ తేదిన జరిగిన జిల్లాపరిషత్ సర్వసభ్య సమావేశంలో ఈ సంఘటన చోటు చేసుకొంది. సమావేశంలో విద్యుత్‌శాఖ, దేవాదాయశాఖ, సాక్షరతాభారతి, బి.సి సంక్షేమశాఖల పనితీరుపై చర్చ జరిగింది. సమావేశానికి హాజరైన అధికారులు ప్రజాప్రతినిధులు లేవనెత్తిన ప్రశ్నలకు సమాధానం చెప్పలేకపోయారు.

దేవాదాయశాఖ ఆధ్వర్యంలో ధూప, దీప నైవేద్యానికి జిల్లాలో ప్రభుత్వం అందిస్తున్న ఆర్థిక సహాయం, వివిధ విధానాలు, భూములు, పత్రాలు ఇతర ఆస్తుల వివరాలపై ఆ శాఖ అసిస్టెంటు కమిషనర్ మహిధర్‌రెడ్డి స్పష్టమైన సమాచారం వెల్లడించలేక నీళ్లు నమిలారు. అలాగే బి.సి సంక్షేమశాఖ విద్యుత్‌శాఖ అధికారులు సైతం వెల్లడించిన సమాచారం, ప్రభుత్వం ప్రకటించిన నిధులకు పొంతన లేకపోవడంపై పలువురు ప్రజా ప్రతినిధులు తీవ్ర అభ్యంతరం వ్యక్తం చేయడం జరిగింది. జడ్పీ సమావేశంలో ప్రజాప్రతినిధులు వెల్లడించిన అభిప్రాయాలు దిగువనిస్తున్నాం.



జడ్పీ సమావేశంలో మాట్లాడుతున్న ఎమ్మెల్యే పరసా రత్నం. ప్రక్కన ఎమ్మెల్యేలు బీద మస్తాన్‌రావు, బల్లి దుర్గాప్రసాద్ తదితరులు.

### హాస్టళ్ల పర్యవేక్షణ లోపభూయిష్టం

జిల్లాలో సంక్షేమశాఖ హాస్టళ్ల నిర్వహణ చాలా అధ్వాన్నంగా వుంటోంది. హాస్టళ్ల పనితీరును పర్యవేక్షించే అధికారులు నిర్లక్ష్యంగానూ, వుదాసీనతగాను వ్యవహరిస్తున్నారు. హాస్టళ్లలో వుండే విద్యార్థుల సంక్షేమంపై అధికారులు దృష్టి సారించడం లేదు. పరిస్థితులు చాలా దుర్భరంగా వుంటున్నాయి. జిల్లా కలెక్టర్ స్పందించి సరిదిద్దాలి.

**పరసా వెంకటరత్నం,** సూళ్లూరుపేట ఎమ్మెల్యే.

### మండలస్థాయిలో సమావేశాలు

ప్రభుత్వం అమలు చేస్తున్న వివిధ పథకాలు చేపడుతున్న పనుల గురించి మరింత సమాచారం తెలుసుకునేందుకు మండల స్థాయిలో అన్ని శాఖల అధికారులతో సమీక్షా సమావేశాలు ఏర్పాటు చేయాలి. ఈ విధంగా చేయడం వలన ప్రజలకు కూడా ప్రభుత్వం చేస్తున్న అభివృద్ధి పనులు తెలిసే అవకాశం వుంటుంది.

**బల్లి దుర్గాప్రసాద్‌రావు,** గూడూరు ఎమ్మెల్యే.

### బిసిల గురించి పట్టించుకోవాలి!

జిల్లాలో ఆర్థికంగా వెనుకబడిన బిసిల అభివృద్ధి గురించి ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. బిసిల సంక్షేమం కోసం ప్రభుత్వం కేటాయిస్తున్న నిధులు సక్రమంగా సద్వినియోగం జరగడం లేదు. అధికారులు కాకి లెక్కలు చెప్పి ప్రక్కదారి పట్టించకుండా బిసిల సంక్షేమం పట్ల దృష్టి సారించాల్సిన అవసరం వుంది.

**బీద మస్తాన్‌రావు,** కావలి ఎమ్మెల్యే.

### దేవాదాయశాఖ సమాచారం ఇవ్వాలి!

జిల్లాలో దేవాదాయశాఖ ఆధ్వర్యంలో వున్న దేవాలయాలు, భూముల వివరాలు గురించి పూర్తి సమాచారం అందించాలి. కోట్ల రూపాయలు ఆస్తులున్న దేవాలయాలు సైతం అభివృద్ధికి నోచుకోవడం లేదు. పూర్తి సమాచారంతో సమావేశానికి హాజరు కావాలని ముందుగా తెలియజేసినా నిర్లక్ష్యంగా వ్యవహరించడం సబబుగా లేదు.

**కాకాణి గోవర్ధన్‌రెడ్డి,** జడ్పీఛైర్మన్.

---

# సహజీవనంతో నైతిక విలువలు పతనం!

పెళ్లి చేసుకోకుండా సహజీవనం, పెళ్లికి ముందు శృంగారంపై సుప్రీంకోర్టు సంచలన వ్యాఖ్యలు చేసింది. వీటిని నేరాలుగా పరిగణించలేమంటూ జస్టిస్ బాలక్రిష్ణన్, వర్మ, చౌహన్‌లతో కూడిన ధర్మాసనం పలు అంశాలను ప్రస్తావించింది. తమిళనటి ఖుష్బూ పెళ్లికి ముందు శృంగారం తప్పుకాదంటూ 2005 సంవత్సరంలో వ్యాఖ్యలు చేయడం, దీనిపై పలువురు ఆగ్రహించి ఆమె వ్యాఖ్యలను ఖండిస్తూ కోర్టులో కేసులు నడిపారు. దాదాపు 20 కేసులు ఖుష్బూపై నమోదయ్యాయి. దీనిపై ఆమె సుప్రీంకోర్టును ఆశ్రయించడంతో పెళ్లికి ముందు సహజీవనం, శృంగారాలపై ధర్మాసనం చేసిన వ్యాఖ్యలు సంచలనం రేకెత్తించాయి. ఇద్దరు వయోజనులు పెళ్లి చేసుకోకుండా కలిసి జీవించడంలో తప్పేంముంది? సహజీవనం నేరమా? అంటూ ప్రశ్నించింది. అనైతికత అనే చర్యలపై నేరముద్ర వేయడం తగదని సూచించారు. ద్వాపరయుగంలో రాధాకృష్ణులు సహజీవనం చేసినట్లు పురాణాలు చెప్తున్నాయంటూ న్యాయమూర్తులు ఈ అంశాన్ని పురాణాలతో ముడి పెట్టారు. ఖుష్బూ వ్యాఖ్యలు యువతను పెడత్రోవ పట్టించేలా వున్నాయని, దేశ నైతిక విలువలను పతనం చేసేలా వున్నాయంటూ న్యాయవాది వ్యాఖ్యానించడాన్ని ధర్మాసనం తప్పుబట్టింది. ఎంతమంది ఆమె వ్యాఖ్యల తర్వాత పెడత్రోవ పట్టారో చెప్పాలని ప్రశ్నల వర్షం కురిపించింది. జీవించేహక్కును ఎలా కాలరాస్తామని ప్రశ్నించింది. సుప్రీంకోర్టు వ్యాఖ్యలపై వివిధ వర్గాల ప్రజలు వెలువరించిన అభిప్రాయాలు ఈ క్రింది విధంగా వున్నాయి.



దేశ అత్యున్నత న్యాయస్థానం సుప్రీంకోర్టు.

### బాధాకరం

సమాజంలో నైతిక విలువలు నానాటికి దిగజారిపోతున్నాయి. యువత దారి తప్పుతున్నది. ఈ పరిస్థితులలో పెళ్లికి ముందు సహజీవనం తప్పుకాదని, దీనిని పురాణ పురుషులతో పోలుస్తూ సుప్రీంకోర్టు వ్యాఖ్యలు చేయడం బాధాకరం. చట్టపరంగా తప్పుకాకపోయినా నైతిక విలువలకు సహజీవనం విఘాతం కల్గిస్తుంది.

**టి.అనూరాధ,** తెలుగుదేశం పార్టీ

### నైతిక విలువలు వ్యక్తిత్వానికి చిహ్నం!

సమాజంలో నైతిక విలువలు అనేవి మహోన్నత వ్యక్తిత్వానికి చిహ్నం. హిందూ సమాజంలో వివాహ వ్యవస్థ అత్యున్నతమైనది. దీనికి ఎంతో ప్రాధాన్యత వుంది. పెళ్లికి ముందు సహజీవనం తదితర అంశాలపై అత్యున్నత న్యాయస్థానం ముందుకు వచ్చిన వివాదం చట్టపరంగా నేరం కాకపోవచ్చు. కానీ నైతికంగా చూస్తే తప్పులు ఒప్పుకావు. ధర్మాసనం తుది తీర్పు సమాజ శ్రేయస్సును దృష్టిలో వుంచుకొనే వెలువరిస్తుందని ఆశిద్దాం.

**డి.హనుమంతరావు,** అడ్వకేట్

### పిల్లలపై ప్రభావం

దేశ సంస్కృతి సంప్రదాయాలకు విదేశాలలోనూ ఎంతో గౌరవం వుంది. ఇతర దేశస్తులు మన సాంప్రదాయాలకు పెద్దపీట వేస్తారు. అలాంటిది మనమే నైతిక విలువలు దెబ్బతినేలా వ్యవహరించడం సబబుకాదు. పెళ్లికి ముందు కలసి తిరగడం, సహజీవనం చేయడం చట్టపరంగా తప్పుకాకపోయినా యువతపై తీవ్ర ప్రభావం చూపుతుంది. సుప్రీంకోర్టు యువతను దృష్టిలో వుంచుకొని తన తీర్పు వెలువరిస్తే బాగుంటుంది.

**రెహానాబేగం,** సిపిఎం పార్టీ

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11



### మంత్రివర్గ ప్రక్షాళన ఖాయం

# పదిమందికి ఉద్వాసన - పన్నెండు మందికి అందలం!

పాతబస్తీ కల్లోల కారణంగా వాయిదా పడిన రాష్ట్ర మంత్రివర్గ విస్తరణ, ఏప్రిల్ 10తేది లోపల జరిగిపోతుందని పరిశీలకుల అంచనా. బుధవారం సాయంత్రానికి మత ఘర్షణలు అదుపులోకి వచ్చాయి. ఒకటి రెండు రోజులలో ప్రజాజీవితం మామూలు దశకు చేరు కొంటుందని భావిస్తున్నారు. ఆ వెంటనే ఢిల్లీ వెళ్ళి, మంత్రివర్గ మార్పుచేర్పులకు అధిష్టానం అనుమతి తీసుకొని రావడానికి సిద్ధమౌతున్నాడు ముఖ్య మంత్రి.

ఏప్రిల్ రెండవ వారంలో ఖాయంగా జరుగు తుందనుకొంటున్న ఈ ముచ్చట, పూర్తిస్థాయి మంత్రి వర్గ ప్రక్షాళనగా వుండబోతుందని చెప్తున్నారు. జగన్ ముద్ర వున్న మంత్రులు దాదాపు పది మందికి ఉద్వా సన చెప్పి, తన స్వంత మనుషులనుకొనే వారిని 12 మంది వరకు కొత్తగా తీసుకొంటాడని సిఎం పేషీ వార్తలు సూచిస్తున్నాయి.

మంత్రులకు కూడా ఈ నిజం బాగా అర్థ మైంది. జగన్ మనుషులనుకొనేవారు మూడురకా లుగా ప్రవర్తిస్తున్నారు. తామెంత ప్రాకులాడినా ముఖ్యమంత్రి తమను దగ్గర చేరనివ్వడు కాబట్టి, మంత్రి పదవి వుంటే వుంటుందని, పోతే పోతుం దనే లెక్కలేనితనంతో వ్యవహరిస్తున్నారన్న వారు ఒక రకం. కెవిపి సిఫార్సు చీటీ కానీ, మరొక మార్గంలో కానీ రోశయ్యను ప్రసన్నం చేసుకొని ఎట్లయినా పదవి కాపాడుకోవాలనుకొనేవారు రెండవ రకం. వీరి ప్రాకులాట ఎబ్బెట్టుగా కన్పిస్తున్నది. రోశయ్య ఆంతరంగికులు, ముఖ్యులు, దగ్గరి బంధువులు అనుకొన్న వారిని వెతికిపట్టి, కోట్లలో డబ్బు ఆశ చూపుతున్నారు. గుంటూరు జిల్లాకు చెందిన ఒక మంత్రి ఐదు కోట్లిస్తానని ఒక వైశ్య ప్రముఖుడితో బేరం పెట్టాడట. చిత్తూరు జిల్లాకు చెందిన మరొక మంత్రి కూడా ఇటువంటి బేరసారాలలో మునిగి తేలుతున్నట్లు చెప్తున్నారు. అటు జగన్‌తో ఇటు ముఖ్యమంత్రితో సఖ్యతగా మెలగాలన్నది వీరి ఉద్దేశం. అయితే రోశయ్య మాత్రం వీరిని దగ్గరకు రానివ్వడం లేదు. జగన్‌ను పూర్తిగా వదలిపెట్టి, మీతోనే వుంటామనే రాజీ ప్రతిపాదన మూడవ రకం మంత్రులు చేస్తున్నారు.



అమరజీవి పొట్టిశ్రీరాములు స్మృత్యర్థంగా ఆయన పుట్టిన జువ్వలదిన్నె గ్రామాన్ని పర్యాటక కేంద్రంగా మార్చాలని ముఖ్యమంత్రి రోశయ్యకు హైదరాబాద్‌లో వినతిపత్రం ఇస్తున్న కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు.

మరొకప్రక్క వైఎస్ నిరాదరణకు గురైన సీనియర్ కాంగ్రెస్ నేతలు రోశయ్య మీద ఎక్కడలేని ఆశలు పెంచుకొంటున్నారు. తమకు అందలం ఖాయమన్న ఆశలు వారిలో రోజురోజుకూ పెరిగి పోతున్నాయి. మర్రి శశిధర్‌రెడ్డి, డిఎల్.రవీంద్రరెడ్డి, జెసి.దివాకర్‌రెడ్డి, కె.జానారెడ్డి, ఆదాల ప్రభాకర్‌రెడ్డి, పిజెఆర్ తనయుడు విష్ణువర్ధన్‌రెడ్డి, ఏరాసు ప్రతాప్‌రెడ్డి, స్పీకర్ కిరణ్‌కుమార్‌రెడ్డి వంటి వారంతా ఈ జాబితాలో వున్నారు. ఎవరికివారు తమకు పదవి ఖాయం అన్న ధీమాతో వున్నారు. అయితే రోశయ్య మీద ఒత్తిడి పెంచుతున్న వారిలో అధికులు రెడ్డి కులానికి చెందినవారు కావడం గమనార్హం. వైఎస్ హయాంలోనే మంత్రివర్గంలో రెడ్ల సంఖ్య పెరిగిపోయిందనే విమర్శ వచ్చింది. ఇప్పుడు రోశయ్య జాబితాలోని పేర్లు వింటుంటే వైఎస్ కంటే ఎక్కువ సంఖ్యలోనే రెడ్డి కులస్తులకు అవకాశం ఇవ్వక తప్పని పరిస్థితి ఎదురౌతుందని చెప్తున్నారు పరిశీలకులు. ఈ ప్రమాదం నివారించ డానికి ఎంతమంది కొత్త రెడ్లకు అవకాశం ఇవ్వ దలుస్తాడో, అంతమంది పాత రెడ్లకు ఉద్వాసన చెప్తాడని తెలుస్తున్నది.

అయితే మంత్రివర్గంలో తీవ్రస్థాయిలో మార్పులు చేయడం అంటే, అసమ్మతిని కొని తెచ్చు కోవడమనే నిజం రోశయ్యకు బాగా తెలుసు కాబట్టి, ఆయన ఆ సాహసానికి పూనుకోక పోవచ్చుననే వాదన కూడా వుంది. జిల్లా స్థాయిలో బలవంతు లైన మంత్రులను తొలగిస్తే వారు చేతులు ముడుచు కొని కూర్చోరు. ప్రక్కరోజు నుంచే ముఖ్యమంత్రికి ఎసరు పెట్టడానికి ప్రయత్నాలు మొదలు పెడతారు. వారికి సహజంగానే జగన్ అండ లభిస్తుంది. ఈ చిక్కు సమస్యలు నెత్తికి తెచ్చుకోవడం కంటే, తనకు కావల్సిన నలుగురైదుగురిని మాత్రం చేర్చుకొని తతిమా మంత్రివర్గం మొత్తాన్ని యధా ప్రకారం కొనసాగిస్తే పోలేదా అని కొందరు శ్రేయోభిలా షులు సలహా ఇస్తున్నారట రోశయ్య గారికి.

### రోశయ్య కసి మీద వున్నాడు

# జగన్‌తో ప్రత్యక్ష జగడం!



వైఎస్ వారసుడు జగన్మోహన్‌రెడ్డికి, ముఖ్యమంత్రి రోశయ్యకు మధ్య దూరం రోజురోజుకి పెరిగి పోతున్నది. పూర్వులేని అఘాతం వలె మారుతున్నది. తన తండ్రి సాధించి పెట్టిన రాజకీయ అధికారాన్ని రోశయ్య అక్రమంగా అనుభవిస్తున్నాడన్నది జగన్‌కు మొదటి నుంచి వున్న అక్కసు. దానితో వైఎస్ అంత్యక్రియలు పూర్తికాక ముందే ముఖ్యమంత్రి పీఠం కోసం వెంపర్లాడాడు జగన్. కాని అది వికటించింది. కేంద్ర నాయ కత్వం దాన్ని దురాశగా పరిగణించి, జగన్ పట్ల ఏహ్యాభావం పెంచుకొన్నది. కొంతకాలం రోశయ్య తనకు తానుగా జగన్‌తో సయోధ్యకు ప్రయత్నం చేశాడు. తనకు ఈ పదవి మీద మోజు లేదని, అధిష్టానం చెప్పింది కాబట్టి స్వీకరించాను, వారు ఎప్పుడు వద్దంటే అప్పుడు ఇంటికి పోతానని పదే పదే చెప్పాడు. కానీ జగన్‌కు అది నచ్చలేదు. తన కోసం, అధిష్టానాన్ని ధిక్కరించి అయినా సిఎం కుర్చీ ఖాళీ చేయాలన్నది ఆయన తొందర పాటు. దానితో రోశయ్యను, ఆయన ప్రభుత్వాన్ని భ్రష్టు పట్టించడానికి తన సాక్షి దినపత్రికను ప్రయో గించడం మొదలు పెట్టాడు. రోజూ వ్యతిరేకవార్తలు ప్రచురించాడు. మరొకప్రక్క తన అనుచరులనుకొన్న మంత్రులను చేరదీసి రెచ్చగొట్టడం మొదలు పెట్టాడు. ఆనం రామనారాయణరెడ్డి, రఘువీరారెడ్డి వంటి వారు నేరుగా క్యాబినెట్ సమావేశంలోనే ముఖ్యమంత్రి మీద దాడికి దిగారు. దానితో అలుగుటయే ఎరు గని అజాతశత్రువు వలె రోశయ్య ఆగ్రహోదగ్రుడయ్యాడు. జగన్ ఇంటికి వెళ్లే మంత్రులను పిలిచి మంద లించాడు. జగన్ తరపున పనులకు వచ్చే ఎమ్మెల్యేల దగ్గర నిష్టూరాలు వ్యక్తం చేశాడు. దానితో ఇద్దరి మధ్య దూరం మొదలైంది. అంచలంచెలుగా అది పెరిగి పెద్దదయ్యింది.

కోనేరు రంగారావు సంతాప సభకు విజయవాడ వెళ్లిన జగన్, ముఖ్యమంత్రి ఎదురు పడకుండా ప్రత్యేక జాగ్రత్తలు తీసుకొని వార్తలలోకి ఎక్కాడు. మొన్న బుధవారం రాత్రి హైదరాబాద్ గ్రాండ్ కాకతీయ హోటల్‌లో కెవిపి రామచంద్రరావు సమీప బంధువు పెండ్లి కార్యక్రమంలో కూడా అదే జరిగింది. రోశయ్య రాకముందే హోటల్‌కు వచ్చి, వెళ్లిపోయాడు జగన్. దాని అర్థం, ముఖ్యమంత్రితో మర్యాదపూర్వక పలకరింపుకు కూడా జగన్ ఇష్టపడడం లేదని. తన మీద ఢిల్లీ పెద్దలకు చాడీలు చెప్తున్నాడని, రాష్ట్రంలో

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.